# కల్యాణి



ఐదంకముల

సాంఘిక నాటకరాజము



- ★ అస్పృశ్యతా నివారణకు ఆదర్శాలు
- ★ దొంగగురువుల దుండగాలు
- ★ త్రాగుబోతుల తందనాలు
- ★ వృద్ధవివాహాల వింతదృశ్యాలు



గ్రంథకర్త :

**గవ్వా మురహరి రెడ్డి**



వెల **1-4-0**

## ★ హెచ్చరిక ★



నా లిఖిత పూర్వకమైన అనుమతి లేనిదే ఈ నాటకమును ప్రదర్శించుటగాని, ఇందులోని పద్యముల, సంభాషణల, మొదలైన వానిని స్క్రీనింగు రికార్డింగు వగైరాలకు వినియోగించుట జరిగినచో తగినచర్య తీసుకొనబడును.

గ్రంథకర్త:
గవ్వా మురహరి రెడ్డి.

# కృతజ్ఞత

---

శ్రీయుత కుందూరు లక్ష్మీకాంతరావు దేశముఖు, సూర్యాపేట (నైజాం)

బహుమానము రు 116.

క. శ్రీమద్భానుపురంధ్రకి
ఖామందుడ! స్వాపతేయఖని, శ్రీ కుందూ
ర్విమలరెడ్డివంశోద్భవ
రమణీయస్వాంత, ప్రథిత, లక్ష్మీకాంతా!

మ. నలుకోనల్ బడి ప్రాకినట్టి రుచిరానల్పప్రభాయుక్తశా
ఖల నొప్పారెడు కల్పభూజము భవత్కాంతారమునం దుంట, పం
డుల గన్నె కవికోకిలల్ దరిసి మోదుల్ చెమ్మగిల్లంగ, పా
టలచే నీ హృదయంపువీణియను మీటన్ నేర్తు రిష్టార్పితై.

ఉ. కోరినయంత నా కవిత కూరిమిబిడ్డను, రంగమందు నే
పారగ నాధిపత్య మొనయంగని, కావ్యరసంబు గ్రోలి, నే
గోరక, గట్నముం జదివి గొప్పదనం బిడితయ్య, నా మదిన్
పారము ముట్టు సంతసము ప్రాజ్ఞమతీ, కృతకృత్యు జేసితౌ.

గీ. ధన్యతను గంటి నీదు సంస్థానమందు
ప్రథమసన్మాన మంది, సూరార్లచేత
ధన్యవాదాలు నీకు నే దండిగాను
కబ్బముల నల్ల ప్రోత్సాహకారి వైతి.

తే. మఱుపుడక్కిన రెడ్డిభూవరుల భాగ
ధేయసంపత్తి మాతృభాషానురక్తి
నాయురారోగ్యభాగ్యంబు లమర లక్ష్మీ
కాంత రాయుగా పుత్రను శ్రీకాంతు దలచి.

గ్రంథకర్త.

# పాత్రలు

## — పురుషులు —

1. ప్రమోదకుమారుడు - కథానాయకుడు
1. శ్రీవల్లభుడు - ప్రమోదకుమారుని యన్న [జమీందారు]
3. అవధాని - మాయస్వామి
4. శర్మ - స్వామిశిష్యుడు
5. శాస్త్రి - ,,
6. డాక్టర్
7. ప్రాసిక్యూటర్
8. జడ్జి
9. భిక్షకుడు
10. మాధవుడు - కల్యాణితమ్ముడు
11. రామన్న - కల్యాణితండ్రి
12. బుర్రకథకుడు - ఇద్దరు వంతకాళ్ళు
13. జవాను

## — స్త్రీలు —

1. కల్యాణి - కథానాయిక [హరిజనకన్య]
2. శాంతం - జమీందారు భార్య

ఓమ్

## దైవస్తుతి

శ్రీ కైవల్య పదాధినాథుని పద శ్రేణిన్ దలన్ దాల్చెదన్
పేర్కన్ నేనొనరింపబూనిన కృతిన్ విద్యావనిన్ మెచ్చగా
నాకున్ భావతరంగ సంభృతవచోనైపుణ్యమున్, బుద్ధియుం
దేకాగ్రంబును, లేఖినీ స్థిరతయున్ నీయంగ సాశీల్పినే.

# కల్యాణి



## ప్రథమాంకము

( మొదటిరంగం—వీధి )

బుర్రకథ చెప్పుచుండగా ప్రమోద్ కుమారుడు ప్రవేశించును. కొంతమంది కూర్చొని యుందురు — ఒకడు కథ చెప్పువాడు, ఇద్దరు ప్రక్కపాటకులు.

1 అన్నలార! మీ అంటను మాటల కర్థము చెప్పండి!
సున్నితంపు మీ బుద్ధిబలముతో శోధన చేయండి!
అంటరాని తనమంటె మీలో ఆత్మద్రోహమండి!
కొంటెపు మాటలు పల్కబోకుడి కోపము వద్దండి!
ఆదిలోన మనమందర మొక్కటేయని గ్రహియించండి
మాదిగ మాలలు మనతో బుట్టిన మానవ జాతండి!
మనము పెట్టిన మధ్య పేర్లని మదిలో తెలియండి!
కనము వినము యే దేశమందు నీ కడజాతులనండి!
మతాధికారులు మధ్యకాలమున మతివీడారండి!
యతీశ్వరులమని రాజుల ప్రజలను హడలించారండి!

అచ్చెర సుకాల కాశలుపట్టి
చచ్చుబీదలను నిచ్చెనకట్టి
స్వర్గసౌధముల పాదములెట్టి
వర్గభేదముల పాశములొగ్గి
తోడిసోదరుల దోసములెంచి
కూడు లేని యా కూతము నెంచి
తావలముగ తమ దాసుల జేసిరి
భావనైచ్యమును ప్రసాదించిరి
తన్నిబైటికే తరిమి వేసిరి
అన్నిట తామే అధికులమనిరి
పగటిదివిటీపల్లకి మేనా ప్రభ వెలిగారండి
ధగధగ వెలిగెను కర్ణకుండలాల్ దబ్బర కాదండి
భుగభుగ పెదవుల ధర్మసూత్రముల్ పొంగిపొరలెనండి
నిగమంబులు తమసొత్తేయంచును నింగికెక్కరండి
బుర్రకథయని వెక్కిగదలపక బుద్ధినినిల్పండీ
మొట్టిమొట్టియను మాదిగమాలల మొరాలకించండి!
... భళి! భళీ! ...

2 ఏకఛత్రముగ భారతసంఘము నేలారోరన్నా!
పాకమైన పెన్నాపాలన్నీ పంచించారన్నా!
పచ్చిగడ్డిని మంచినారీ పరమభక్తులన్నా
సిచ్చులు పూజాపురాణాల్ వీరి నిత్యకృత్యమన్నా
పాలవెల్లిలో హాలాహలము ప్రభవించిందన్నా
ఏలినవారీవిధముగ ప్రభలను వెలిగించారన్నా
హరిజనులంటె అంటనివారట
పురముబైటి కాపురమువారట
వీధిలోకిరా వీలు లేదట
బాధలన్నివీరి పాలేనంట
బావులుముట్టుట పాపంబంట
కావుకావుమను కాకులకంటె
నీచమంట బల్ దోసమంటహా!

కూకటివేళ్లను పీకినారిదే గూడుపుఠానన్నా
పీకలు నొక్కి పచ్చిరక్తము పీల్చారోరన్నా
దంశిభోగముల దావానలమున దహియించారన్నా
పిండిచేసి ఊర్ధ్వపుండ్రము దిద్దిబేవురించిరన్నా!

దండివారు వృద్ధంజులువీరా
లుంజుపూళ్లలోనుండరాదట
సర్వజీవులను సమతను బ్రోచే
సర్వవ్యాపకుని సదనము పెట్టి
గంటలు గొట్టిరి గణగణమని జట
గానము జేసిరి ఘణంఘణఘణఘణ
ఎలుకలు పిల్లులు మెంతో వింతగ
కలకలమని కైంకర్యము చేసే
హరినిజూచుటే యపరాధంబని
హరిజనులను బల్ హడలెత్తించిరి

నీడసోకితే ఛీఛీయని చన్నీళ్ళదేశరన్నా
వాడకెళ్లితే ఛూఛూ యని చీవాట్లుపెట్టిరన్నా
పరులకు స్వాగతమిచ్చి పెద్ద తువాను లేపిరన్నా
భరతమాతను బాధలపెట్టి పట్టిచ్చారన్నా
బుట్టకథయని ... ... భళి భళీ

3 పండువంటి హిందూఖండాన్ని ఖండఖండాలుగా జీల్చి చెండారోయ్
పెండారులువీరు పోట్లాడి పరదండివాని పాలజేశారోయ్
మారుమనుము సేవగిస్తారు భోగమాళ్ళ పంచబడిచస్తారోయ్
వారివీరితో డింటారు మనవాళ్ళు చూస్తే తప్పంటారోయ్
కల్లం కె గుర్రుమంటారు ఘాటుఘాటు సారాగంటకొట్టారోయ్
మల్లుగుడ్డ పూజచేస్తారు మనతల్లి ఖాదీ సీసడిస్తారోయ్

నేలమున్నట వీరివంతట
నేలదాచుట వారివంతట
కాయకష్టము వీరివంతట
కాలుచాచుట వారివంతట

బుర్రెముగంజి వీరివంతట
భూరిభోజ్యములు వారివంతట
పాట్లుపూడుట వీరివంతట
బొజ్జలుద్దుట వారివంతట
అయ్యాబాబన వీరివంతట
అరెరే! వెధవన వారి వంతట
మండుటెండలు వీరివంతట
మంచుమేడలు వారివంతట

న్యాయముకాదిది న్యాయముకాదిది నచ్చనిమాటండీ!
న్యాయమూర్తులౌ మనపూర్వుల నామము నిల్పండీ!
పశుపక్ష్యాదుల పరమప్రేమతో బాలించారండీ,
పశువులకంటె నరుడుత్తముడని భావనసేయండి
"గుణాగుణేషువర్తంతే" యని గురుసూత్రంబండి
గుణాగుణపారణజేసే గీతాగుణపాఠంబండి
బ్రహ్మనాయుని యింటబెరిగిన ప్రభువీడేనండి
బ్రహ్మజ్ఞానము కలిగినవాడే బ్రాహ్మణుడనుకోండి
ఉచ్చనీచతలు గుణమునుబట్టి యున్నాయనుకోండి
పచ్చని సంపద దానిమూలమున ప్రాప్తించూనండి
ఇహపరాలకు దూరమైతిమీ ఈర్ష్యచేతనండి
మహాత్మసంతతి మార్గదర్శకుడు మనకున్నాడండి
ఖండత్వంబె యఖండయశంబును కాలరాచెనండి
మొండిపట్టుచే భూమండలమున బండలుకాకండి
అందరమొకటను ఐక్యభావమును అమలునపెట్టండి
సుందరమగు స్వేచ్ఛాస్వర్గంబును చూరగొనుమండి
అయ్యలార మీ యస్పృశ్యతకు అర్థములేదండి
సున్నితంపు మీ బుద్ధిబలముతో శోధనచెయ్యండి
బుజ్జికథయని వెజ్జిగదలపక బుద్ధిని నిల్పండి
మొట్టో మొట్టోయను మాదిగమాలల మొరాలకించండి

...భళి భళీ... (తెరవ్రాలును)

---

## ప్రథమాంకం — రెండవరంగం

(అడవికి షికారుకువచ్చిన శర్మ చినిగిన సూటుతో ప్రవేశం)

ఉ॥ వైనుభవానినిన్ భువనవందిత, త్యాగదమైకవాహినిన్
మానక, నాదు మానసపు మందిరమందున బాదుకొల్పి నే
పానముసేయుదచ్ఛ్రగణ పంకజపుం మధుధారలన్, వెతల్
స్నానమువీడె, శ్రీల పుష్పతావులు ఘుమ్మనె నేమ నందికన్.

(Well) వెల్ అదృష్టమంటే నాదే. ఒకరాజాధిరాజైనా తన (life) లో నామాదిరి (enjoy) ఎంజాయ్ చేసియుండడు. మహాత్తర పురుషులంటే నాబోటివాళ్లనేఅర్థంబాను! నేనే బి. ఏ., పరీక్షలో దండయాత్ర కొట్టకుండావుంటే ఏమున్నైప్పు రూపాయిల ఉద్యోగంలోనో సీల్గాల్సి వచ్చేది. కుశాగ్రబుద్ధులను కుమ్మరిపురుగులకు పోల్చారు మహాత్ములు. అంతకేమనం అన్నీ అనుభవిస్తూకూడ యీపాప ప్రపంచాన్నంటకుండావున్నాం. నవ్వులుగాను సర్టెన్లీ (certainly) నాకు నేనేసాటి.

చ॥ చదివెడు కాలమంకు గుసగసమ్ము గుండెలలోన నాడితిఁ
సదనమునందు పిన్నలను సాకిన పెద్దలఁ గాలరాచితిఁ
మొదలితి కట్రకాంత్రడ గుచి మేటిగ, బ్రాందికి దిట్టబంటనై
బెదరదు నామనంబు, భువిఁ బెద్దలకేనియు బ్రహ్మకేనియుఁ

(కొంతపచారుచేసి) (Damit) డేమిట్ (Drink) డ్రింకుకుపోయిన మా ఆషాఢభూతిగా డింతవరకు రానందువల్ల నాగుండెలు నక్షత్రాల గుణిస్తున్నవి. వీడుకూడ (to some extent) టు సం ఎక్స్టెంటు నా ధోరణిలోపడ్డాడు. (Infer) ఇంటర్ లో పల్టీకొట్టడమే అతనికి మహాదృష్టంకట్టి నాబోటి హేమాహేమీల సహవాసం లభించింది. (ఆగి) నిజంచెప్పాల్సివస్తే, నాకంటె (Senior most hand) సీనియర్ మోష్టు హ్యాండు మా అవధానివల్ల, మా ఇద్దరికి చెరొకస్వర్గం లభించినట్టయింది. (ప్రక్కకుచూచి) అదిగో మావాడొస్తున్నాడు. హే శిష్యా (Hurry up) హరి యప్.

(శాస్త్రి, సీసాయుక్తంగా ప్రవేశం)

శర్మ:- ఏం (Brother) బ్రదర్, గుండెలు ప్రాణాయామం వసుతూ వుంటే ఇంత లేట్ (late) చేశావు.

శా:- ఏడ్చావులేవోయి వెర్రి మొహమా, నాలాంటి (Smart fellow) స్మార్టుఫెలో ఒక పని తల్పెడంటే ఏదో వుళ కుంభకోణంజరిపాడనుకో

శ:- (శాస్త్రిచేతిలోని సీసాలాంగుకొని) (I see) ఐ సీ అదేంటో తెల విస్తారా పండిట్ జీ.

శా;- అల్లాగే తెలవిస్తాకాని, శ్రీపాదతీర్థం కాస్త సేవించనియ్యి. (శర్మ సీసాచేతికివ్వగా త్రాగి) ఏముందోయి. ఒక వెర్రి వెంగ ళప్ప జేబుకు బుద్ధిచెప్పాను. (మనీపర్సు చూపెట్టును)

శ;- (నవ్వుతూ) (My God) మై గాడ్ బలే హానెబుల్ ప్రీచర్ వోయి ఏదీ షేకుహేండు.

శా:- (తూలుతూ) అయితేం బ్రదర్ యీ పాపిష్టిడబ్బును మనం ఒక దినంకూడ మన పర్సులో వుంచం, వుండదు, వుండ కూడదు. (పచారు చేయును).

శ:- (తూలుతూ) అరె, శాస్త్రిమహాశయ్ కాంతంగారిని పడితే మనజన్మంతా కనక మయమవుతుందోయి.

శా:- (Yes) యస్. కాని అల్లాటివాళ్ళ తెరువెళ్ళితే దేహశుద్ధి సరిగా అవుతుంది.

శ:- వెర్రినాయనా యిన్నాళ్ళనుండి నా ప్రతాపాలు తెల్సుకోక వట్టి చవటలాగా మాట్లాడావు. అవమానం. మొదటిసారి క్షమించాను. .

శా:- ధన్యోస్మి మాటవరసకన్నాగాని, కాంతలంటే కక్కుర్తి పడనా, నేను మాత్రం.

శ:- (నవ్వి) ఆముండా దేవుడు ఆ అందాల రాశిని ఆ ముసలి వృషభానికి మెడగట్టకుంటే, మన ఆనందాల కాహుతి చేస్తేగాదు.

శా:- (Fact) ఫ్యాక్ట్. ఆవకాయముక్కవలె కరకరలాడుతున్న ఆవిడ వయసూ, వలపూ, తలుపుకొచ్చేసరికి, నాగుండెలు గుభేలుమని, విరహాబ్ధిలో విరుచుకు పడిపోతున్నాను. తాళలేను (ఆవేశం)

క॥ ఆలేడిని మనకివ్వంజాలని ఆల్ట్రైటీ చచ్చు చైదంబులకున్
ఫీలై, యేడ్పుటయూ, వాసెడైలూవాంగతకి, డమ్మా పక్కకనానా.

శ:- వహూవ్వా, వవ్వా. శాంతింపుమా, షేక్స్పియర్ మహాశయా నీవాడదాన్ని గురించి, ఆసుభారకనిత్యమల్లి అట్టే విశికే వరకు, నా మనస్సుగూడా మరీ లొట్టవేస్తుంది.

శా:- ఆహా (సీసాపట్టుకొని) దీనికంతా యీ మొదనన్నం మహాలక్ష్మియే కారణం. మన మొంగటి వాళ్ళం.

శ:- అందుకే దేవిగారి కరుణారసం. ఆపాదమస్తకం పారాలంటే మనకో దేవుడుండితీరాలి.

శా:- ఇప్పుడెల్లా మనకు లభిస్తుందో యీ మన్మధుడా నన్నైనా అడదాన్ని చేసాడుగాడా నెర్రిబ్రహ్మ.

శ:- పుష్పాలేని కారంలాగా వుంది. యిప్పాకు మనవజా. అందుకే పెద్దలేమన్నారు.

గీ॥ మద్యపానంపు కేళిగా మర్త్యమందు
మనిద లేకన్న అపచార మొదవుగాదె!
సూటు లేకుండ ధరియించు హేటువోలె
ఖడ్గహీనమా యోధుని కరిగుభంగి.

శా:- (కల్యాణి పాట వినుట నభినయించి) హాలో బ్రదర్, ఏదో కమలాక్షి కంఠధ్వని వినబడుతూ వుందే మననోములు పండినవి.

శ:- (విని ప్రక్కకుచూచి) ఒక చక్కని సుందరి యిటువేపే వస్తూంది. బెస్టు ఆపర్చునిటీ. యీ చెట్టుచాటున దాగుండి కేప్చర్ చేదాం. కమాన్.

(శర్మ శాస్త్రి పక్కకు దాగెదరు. కల్యాణి మాధవులు బుట్ట లతో ప్రవేశిస్తూ పాట పాడుదురు.)

—♦ పాట ♦—

బాలనాగమ్మలోని 'వసంతసుమనోవనము' మాదిరి.

ఈ వసంతవనవీధులలో విహరింతమురా రె హాయి

కోమలజాజి కోర్కెదీరగ
ప్రేమంపు పూపొదరిండ్లగ
సీమంబుగాఁ దలదాల్చగ

గులాబిమల్లె విలాసవతులు
వలాటముగ పూపుటముల్
వయ్యారముగ మేదాల్చగ
సెమలిపడుచు లాటాదగ

తేటులు ఝుమ్మని శృతిమీటగ
కోయిల కన్నెల్ హాయినిజేరి
కుహూ కుహూ యనిపాడెగ
ఆహా, ఆహా యని నవ్వగ

(పాట ముగించగానే శాస్త్రి, శర్మలు కల్యాణిపై బడెదరు. వెంటనే మాధవుడు కేకలువేస్తూ పరుగెత్తు చుండగా షికారుకు వెళ్ళిన ప్రమోదుడు పరుగెత్తుకొనివచ్చి కల్యాణిని కాపాడును. శర్మ పారిపోతూ ప్రమోదుని తలపై సీసాతో గొట్టగా ప్రమోద్ మూర్ఛిల్లును. అది కల్యాణిచూచి)

క:- (జాలిప్రేమ) అయ్యో. నాకై దెబ్బతినిన, యీ దయామయుడు గొప్ప. వంశీయుడుగా కనబడుతున్నాడు. దైవమా రక్షించవా. (ఆగి) యిప్పుడు నేను బిడియపడితే లాభంలేదు. (అనుమాన భయాలతో మెల్లగా ప్రమోద్ దగ్గరకూర్చొని ప్రమోదుని తలను తన తొడపై పెట్టుకుని విసరుతూ)

గీ॥ ఈ మహాభాగుడెవ్వడో ఎరుగనైతి
నాదు ప్రణయంపు సౌధంబు నాహరించె

ప్రాణమే లేని పూవులోఁ దేనెఁ బోసె
శోభ లేని నా జీవనజ్యోతి యయ్యె.

(యోచించి, మాధవా మన అమ్మ కోప్పడుతుందేమో
అక్కెళ్ళి కోసు పిడక తేర్చాండరాదు. నేనిప్పుడే వస్తాగాని.

మా:- తెలివొచ్చిన తర్వాత, ఆయనే పిలుస్తాడుగాని, నీవు రారా
దక్కా వెళ్దాం.

క;- తమ్ముడూ, తప్పుగాను పాపం మంచివాడు. మనకోసం ఎంత
దెబ్బతిన్నాడో చూచావుగాదూ!

మా:- సరే మంచిది వెళ్తున్నాగాని, నీవు తొందరగా రా (వెళ్లును)

(ఇంతలో ప్రమోద్ కదలి కనులు తెరవబోగా కల్యాణి తలదించును
ప్రమోద్ గ్రహించి అనేకాలోచనం కనబర్చి నిశ్చలుడగును. అప్పుడు
కల్యాణి తనలో)

ఉ॥ జీవలకాని మోహిపున్నని వీరు, తేనవున్నాను రెందముల్
పావసరాగకీర్తి సుధాంబుధి నీ కవి జెప్పనేల్చి నా
కేవ్రి మాధుర్యలంపి నిలి లతలు ప్రేమమానున్నవింక నే
నేవిధ బాయుదీప్తులని, నేర్పున దేముంతంబా దీపికా

(అంతట ప్రమోద్ లేచి కూర్చుండును కల్యాణి లేచి పోబోవును)

ప్ర:- అబ్బా దాహంగావుందే ఇక్కడెక్కడైనా నీళ్లుదొరుకుతయ్యా

క:- (నిల్చి) దగ్గరే చలమొకటుంది. త్రాగుదురుగాని రండి (పోబోవును)

ప్ర;- నన్ను రానిస్తావా, నీవే తెస్తావా.

క;- (చిరునవ్వుతో) నేను తాగితే మీదాహం పోతుందా?

ప్ర;- ఓ తప్పక

క;- అబ్బ మీమాటల కేంగాని రండి. ఆయాసపడతారు.

ప్ర;- చేతకావటం లేదు. కొద్దిగా చేయందిచ్చావంటే—పోనీ నేనే
వెళ్లి తాగుతా నీకు శ్రమెందుకు?

క;- (దినంగా) మేమంటరానివాళ్ళం

ప్ర;- మనుష్యుల కంటేంటి అర్ధంలేనిమాట.

క:- [ఆశ్చర్యం] ఆ. అంటేలేదా.

ప్ర;- [తటాలున లేచి చేయిపట్టుకొనును] నేను లేకుండా వెళ్తే మళ్ళీ ఎవరయినా పట్టుకుంటే [ఇద్దరు నవ్వుదురు]

ప్ర;- సరిగాని, ఎంతవరకు చదివావు.

క;- ఏదో మాకు తగినట్టు. నాల్గవ క్లాసు మట్టుకు.

ప్ర;- ఆ. నాల్గు క్లాసులవరకు చదివి కూడ నీకీ అంటూరని పిచ్చేంటి.

క;- ఆ. మేమెంత చదివినా యేంలాభం. మీతో ఏం సాటి

ప్ర;- పిచ్చి పిల్లా ప్రేమకు కులమూ లేదు. మతమూ లేదు. నీకీ మాత్రం తెలియదా.

క;- [ఆశ్చర్యం] ఆ. ప్రేమా. తప్పు మీరు పెద్దలు.

ప్ర;- నేనూ నీమోస్తరు చిన్నవాణ్నే. ముసలాణ్ణైతే గాదు.

క;- మీరసలు దప్పి మాటే మరచారు. నేను వెళుతా.

ప్ర:- ఇదిగో. నీకేం ఆయాసం కలుగలేదు గదా. వాళ్ళవల్ల.

క;- [కాదన్నట్లు తల విసిరి] మీకే నావల్ల

ప్ర;- No. No. ఇప్పుడు నాకు దెబ్బ బాధేమీ లేదు. వకటే తప్ప [నిట్టూర్పు విడచును.]

క:- ఇంకేమైనా బాధ. [ముందుకు రెండడుగులు వేయును.]

ప్ర;- [బాధ నభినయించి] ఇదిగో యిక్కడ [అనుచూ కల్యాణి చేయిని పట్టుకొని తన హృదయానికి హత్తుకొనును. ఒక చేయి భుజంపై వేసి రెండవ చేతితో సీసా పట్టుకొని] ఆహా ఏమి యీ మద్యపాన మహాత్వము.

సీ॥ మద్యంబు సాగించు, మారణ హోమంబుఁ
దన యనుంగుల నేని దలఁప నీక

మద్యంబు సేయించు మాతకు ద్రోహంబుఁ
జను బాల బ్రోచిన సాధ్వి యనక
మద్యంబు చెరపించు సద్యశో విధవాల
నొప్పిన తిన వంశ ముఁ గు ననక
మద్యంబు సృష్టించు మానవి రోగాల
నుక్కు దేహంబుల చక్కఁ గనక

తే॥గీ॥ బుద్ధి నిల బుగ్గిఁ జేసెను రద్దిపట్టు
చనువు లన్నియు మఱపించు చదలుఁ పుట్టి
భారతాంబను కడగండ్ల పాలుఁ జేసె
నాంధ్ర భూమిని ప్రేతాల కప్పగించె

దీని వల్ల పట్టణాలలోదురాచారాలుదినదినానికిమరీఎక్కు వౌతున్నాయి

క;— నన్ను పోనివ్వండి. ఆలస్యమైంది.

ప్ర;— వెళ్ళుదువు గాని. నేనొక టడుగుతా. నిజం చెప్తావా.

క:— [చిరునవ్వుతో] నే నెరుకల దాన్నిగాదు.

ప్ర;— కాదుగాని. పిరికి దానివి.

క;— (కాదన్నట్లుగా) ఊఁహు. (తలవిసరును)

ప్రి;— అయితే చెప్పు నవిస్తరంగా. నీపేరు, వూరు. కమ్మని మాటల్తో

క;— కల్యాణి ......... యీ కనపడే పల్లె.

ప్రి;— ఆహా ఎంత కమ్మని పేరు. నీసౌందర్యానికి నీసుగుణాలకు నీ
వాఙ్మాధుర్యానికి దేవతలు పెట్టిన పేరల్లేవుందే కల్యాణి.

క;— మీ పేరు విననచ్చా. [సిగ్గుతో]

ప్రి:— ఓ నాపేరా నీవొక్క సారి పిలుస్తానంటే చెప్తా

క;— చెప్పండి. విని సంతోషిస్తా.

ప్రి:— ఊహూ నీకు వింటె సంతోషమైతే నాకు పిలుస్తే సంతోషం.
మరి పిలుస్తావా.

క:— [ఓరచూపుల్తో తల పంకించును.]

ప్రి;— "ప్రిమోద్" ఏదీ. అను.[చుబుకమును పట్టుకొనును.]

క:— [సిగ్గుతో కండ్లు కేసి చూచి] ప్రమోద్ (నవ్వును)

ప్ర;— [కౌగలించుకొని దృష్టికలిపి కల్యాణీ!

(ఇంతలో మానవుడు ఒక్కాయని కేక వేయును.)

క;— నే వెళుత్తా. వినవండి.

ప్ర;— రేపు సాయంత్రం కల్యుస్తావా యిక్కడనే యీ వేళకు.

క;— [తల పంకించి వెళ్ళలేక వెళ్ళలేక వెనుకకు చూస్తూ వెళ్ళును.]

ప్ర;— కొంతవడి నిశ్శబ్దముగా]

గేయం. ప్రణయంపు తేనియల్ - బాగుగా పూరించి

హృదయ పేటిక లోన బదిల పరచిననాడు

కలశంబు హరియించి గగనంబు నకు నెగసె

మలయ మారుత మయ్యెనో

---

ప్ర మో ద క ము.

సూదన రంగము

[ఇంట్లో ప్రమోద కుమారుడు కుర్చీ పయి కూర్చుని]

మనసే మాదిరి

ఎటులా - మనుదునా - నినునా - ప్రియసి గాంచకే సకా

తేనెల్ చిలెక్కెడు భావము ల్

తేటులు భ్రమియించు కన్నవలన్

జాళువా, ఛాయను దాటి చెను

సౌందర్య రాశిన్ నేనెటు మాతున్ ............ ప్రియసిగ ......

(కొంత యోజించి) విచారము. మన సాంఘిక స్వార్థారాధకులు తలుపున కొట్టినప్పుడల్లా, నా గుండెలు చెదురుతూ వున్నవి, సకలదేశ శిరోమణియై సర్వ కల్యాణ ప్రదమై సకల శాస్త్ర సంపన్నమైన, మన దేశ మాతను అస్పృశ్యతా పిశాచాని కప్పగించడం వల్ల, చిక్కి సోలి, సగమైపోయింది. గోముఖ వ్యాఘ్రములైన మత కర్తలు బీదల పాలిటి పెనుభూతములై అంటరాని తనానికర్పించి

భూలోక నరకాన్ని సృష్టించారు. (కొంత విచారపడి) సత్పథంలో
వచ్చినా సార్థకమౌతుందీ మానవ జన్మ కాబట్టి.

ఉ. మానసమా! వ్యథం బడకు మాధురి మంబగు ప్రేమవాహినిన్
మానిని గూడి భావిని ప్రమాదము లెన్నియు సంఘటించినన్
యానము జేసి ధర్మ సముపార్జన సేయుట మేలు కాలమం
దూనిన యస్త్రముల్ దిగిచి యుంచుట పాడియె! ధర్మకాంక్షికిన్.

ఏది ఎటులైనా. కానున్నదే యగును.

[ప్రమోద్ అని పిలుస్తూ శ్రీ వల్లభుడు కాంతంతో ప్రవేశిం
చును. ప్రమోద్ లేచి నిలబడును.]

శ్రీ;— (కూర్చుని) ఏం భోజనం చేయు లేదటే. ఆరోగ్యం సరిగా లేదా

ప్ర;— ఏం లేదన్నయ్యా యీ పూట ఆకలి లేదు.

కాం;— ఏం దాచి పెట్టావులే. నీముఖ లక్షణాలే చెప్తున్నాయి. పెండ్లి
కావాలని.

శ్రీ — అబ్బాయీ నీ కేమైనా కావలసియుంటే నన్నడగ కూడదమ్మా
నీ కేం తక్కువ.

కా;— పెళ్ళాం కావలె నని కూడా అడుగుతా రేమిటి.

శ్రీ;— అబ్బ నీవుండవే. పానకంలో పుడకలాగ.

ప్ర:— కావల్సిం దేమీ లే దన్నయ్యా. ఇంక ముందు చదవాలనే
విషయం తప్ప

శ్రీ;— నీయిష్టమున్నంత వరకు చదువు. వద్దన్నానా. కాని
కల్యాణం కాస్తా చేసుకొని వెళ్ళితే నాప్రాణాని కెంతో తృప్తి
కరంగా వుంటుంది.

కాం;— ఇం కేం కావల్సిం దేదో కాళ్ళకు తగిలినట్లైంది.

ప్ర;— (దుఃఖ హర్షములతో) క...ల్యా...ణం.......

శ్రీ;— ప్రమోద్ మాటలాడ వేం. పక్షం రోజులలోనే సర్వమూ సిద్ధం.

ప్రి;— అన్నయ్యా క్షమించండి. నేను యల్. యల్. బి. ప్యాసయిం దాకా పెళ్ళి చేసుకోను.

శ్రీ;— (విచారాశ్చర్యములతో) అంతానిశ్చయమైన తర్వాత యిదేమి వెర్రి. అంతగా అయితే పెండ్లి కాగానే దంపతులు వెళ్ళుదురు గానిలే

కాం;— పదివేల కట్నం నగదు. నీకేం కొదువ. అదే డబ్బుతో మదాసులో కాపరం పెట్టినా పెట్టవచ్చు.

ప్రి;— అబ్బా డబ్బుకు కాదమ్మా......

శ్రీ;— ఎన్నడూ నామాటకు జవదాటని వాడవు కదాయని పెద్దవాళ్ళకు మాట యిచ్చి కట్నం కూడా తీసుకున్నానే.

శా॥ నామాటల్ జవదాట వంచు మదినన్నన్ మించితో నీపయిన్
వ్యామోహంబునఁ దమ్ముడంచు వసువుల్ వాంఛించితిన్ మూలుగా
నామాంద్యంబు విడంగ లోకమెదుటన్ నైరజితుంజేసి మా
మేమాత్రంబును జూపకుండ ఁదగు శాంతిరీతి జేయంగ దే.

కాం;— చదువుకున్న వాడవని యింత డబ్బిస్తే......

ప్రి;— (తీక్ష్ణంగా) డబ్బు కొరకు గాదమ్మా పెళ్ళి.

గీ. పెండ్లియాడుట సౌఖ్య సంప్రీతికొరకు
ధనమునకుఁ గాదు చుట్టాలఁ దనువగాదు
నేటి లోకాన, కట్నాల ధాటి వలన
కాపురము లెన్నొ కలుషాబ్ధిఁ గలిగి పోవె.

శ్రీ;— ఓహో అయితే యిప్పుడు నే చెరుపుకై చేస్తానన్నమాట.

ప్రి;— కాదన్నయ్యా. నేనేదన్నా మీకు కష్టంగా వుంటుంది. గాని నన్నడగకుండా పిల్లను నాకు చూపకుండా హఠాత్తుగా నాత్రిపై పర్వతం వేయటం భావ్యమా.

శ్రీ;— (క్రోధావేశాలతో) భావ్యాభావ్యములు తెలియుటానికి నేను

నీ యంత చదువుకున్నవాడనా (కొంత ఆగి) నిన్ను సాకి
చదువు చెప్పించి నందుకు బాగా బుద్ధి చెప్పావు.

సీ. పిన్ననాఁటను గోలె కన్నదండ్రిని బోలి
లాలించి నందుకీ లాభమయ్యె
అడుగక మున్నె నిన్ననిన్ని సౌఖ్యంబులఁ
సాగించుటే నాదు దోసమయ్యె
బొక్కసంబందున్న రొక్కము వెచ్చించి
చదివించుటే యపచారమయ్యె
తుచ్ఛ భాషలోని యచ్ఛంపు పసయట్టు
లార్ష ధర్మంబుల నణచుటయ్యె

గీ. పండ్లకై రాయి విసరుటే గంక మయ్యె
దనది యను భావమునఁ జ్వలనుని ముదమున
ముద్దుగొని నట్టులయ్యెను రద్దిచేసి
పరిభవాగ్నిలో నను దగ్ధపఱప కయ్యె

పరి:—నన్నేమయినా దూషించండి. నామనస్సంగీకరించటం లేదు. నా
మనస్సంగీకరించని విషయాలన్నీ అనర్థదాయకాలే

శ్రీ:—(తీక్ష్ణంగా) ద్రోహి. చేసుకోకుండా వీలు లేదు. కాదంటావా
అనుభవిస్తావు. రెండు దినాలు గడువిస్తున్నాను. ఏదో వకటి
తేల్చి చెప్పు. (చురచుర పోవును)

కాం:- యివ్వాళ కేపటి విద్యావంతులు పెద్దవాళ్ళ పరువు బాగా నిల్పే
టట్టుందే.

ఉ. చక్కని చుక్క వంటి యొక చానను పెండిలి సేయ నెంతయో
రొక్కముఁ గప్పమిచ్చినను గోసితి వక్కట! నీవు పూజ్యులన్
యిక్కరణిన్ దిరస్కృతిని హీనులఁ జేయుట పాడి యయ్యె నీ
ఫక్కిని జూడ నంధునకు బాల్పడి దర్పణ మిచ్చుటయ్యెడిన్.

(నిష్క్రమణ.)

ప్రి;- (కొంతతడవు యోజించి) ఏంచేసేది ముందుకు బోయిన సూయి వెనుకకు పోయిన గోయి (ఆగి) అవును నాఆత్మ సాక్షిగా ప్రేమిం చాను. ఇది పెద్దజీవిత సమస్య. నాసోదరుడు నా భావిజీవిత పరిష్కారాసి కెల్లప్పుడు సాయపడడు గదా. పైగా ఒక అమా యక పిల్లకు ద్రోహం చేసిన వాడనవుతాను. (ఆగి) రెండుదిన ములు గడువుమాత్రం యిచ్చారు గదా. యీరోజు ప్రోగ్రాం ప్రకారం నాకల్యాణిని కలుసుకొని రేపేవిధంగానయినా మద్రా సుకు పలాయనం చెప్పడమే శ్రేయం. లేకున్న అన్నగారి యెదుట విరోధినై తిరగాల్సొస్తుంది.

తే॥ గీ॥ ఆత్మసాక్షిగఁ ప్రేమించి నట్టిచేల
నిటుల విడచిన గారుచీఁకటులె యులము
నాదు ప్రణయంపు జీవిత మందిరమున
బ్రతికి ఫలమున్నె జీవచ్ఛవంబు వ్రూలె

---

ప్రథమాంకము—నాల్గవరంగం

(అడవిలో కల్యాణి, మాధవుల ప్రవేశం )

క;- మాధవా, వారొస్తున్నారేమో ఆగట్టెక్కిచూడు. (మాధ వుడు వెళ్లును) వారింతవరకు రాకపోవటానికి కారణమేమొ యుండును.

పాట (ధీరధీర మాదిరి)

జాగదేలా ననుడాయనీకు విచారమదేలనోయీ
మల్లెపూవుల చల్లగాలిక బనిచితిని నీకై
రాగపద్మినీ తేనెలానగ రాగదే సఖుడా
వేగరమ్మిక వేళయయ్యెను వేగపోవలయుకా.

(ప్రమోద్ వెనుకనుండివచ్చి కల్యాణి కన్నులుమూయును)

క;- (ప్రమోద్ చేతులుపట్టుకొని) అమ్మ దొంగ దొరికాడు

ప్ర:- దొంగపేరు?

క:- నాకు తెలియదు విశిస్తే చూచిచెప్తా.

ప్ర;- చెప్తేనే లేకుంటే ఉహు

క:- నా దొంగే ప్రేమదొంగ

ప్ర:- (విడిచి నవ్వుతూ ప్రక్కనకూర్చుని) ఎంతసేపైనదివచ్చి

క;- ఎంతసేపైతేనేం ఎంతైనామీకు మగవారుకదా

ప్ర - కొంపదీసి ఆడదాన్ననుకున్నావా ఏం?

క;- మీ మాటలకేం లెండి

ప్ర;- సరికాని నిన్న జరిగినసంగతంతా మీ అమ్మ నాన్నకు తెలిసిందా.

క:- ఎలా తెలుస్తుంది నే చెప్తేగా.

ప్ర;- మాధవుడు చెప్పాడేమోనని... ...

క;- మాధవుడు మనవిషయంలో అలాచెప్పేవాడు కాడు.

ప్ర;- ఏమో ఎలాతెలుసు

క;- చెప్పడంటే మహానుభావా

మా;- (నవ్వుతూవచ్చి) నేనుమాత్రం చెప్తానా, కాని

ప్ర;- ఇంకా కానీ ఏమిటోయి మాధవ్

మా:- (సప్తస్వరములలో) ఈ-రో-జు-నే-చె-ప్పా-తా. ను చె-ప్ప-క నే-నుం-డ-లే-ను

ప్ర:- అబ్బో నీకు సంగీతంకూడ వచ్చునే

మా;- మరేమనుకున్నారుసార్, బాగావచ్చు

ప్ర;- (పొట్లం చూపెట్టి) ఏది మాధవ్, ఒక్క పాట పాడు పొట్లం యిస్తాను.

మా- ఉహు, పొట్లాలకి పుట్నాలకి పాడేపాటకాదు.

ప్ర- మరేంగావాలో చెప్పు

మా- మాకు పెద్ద వినాయకుడు కావాలి

ప్ర– యేంచేసుకుంటావు

మా– మీ యిద్దరికి కష్టాలు రాకుండా పూజిస్తా (అంతానవ్వాదురు)

క– తెప్పిస్తారుగాని పాడరా వింటారట

మా– పాడమన్నారా సార్ అటుయిటు చూచారంటె చప్పునఆపేస్తా (ఎగురుతూ)

ప్ర– అచ్ఛా బలే చలాకీకుర్రాడు

పాట — సావనకె నజారే హై, మాదిరి,

మా- కోకిల కన్నియలు కూసెనె కుహూ కుహూ ఆకసమున కెగసెనె ఆహాహాహా
పడతుల గూడిన బాతులు నీటనె బుడబుడ దేల్చుటదేలా
తేటులు తేనియలానుచు నవ్వెనె ఆహాహాహా ... హాహా

ఇక చాలునా

ప్ర;-- చాలులే పాపం అలసిపోయావ్ ఇదిగో (పొట్లం ఇచ్చును)

క- మీ రేదో విచారంగా కనబడుతున్నారే ఎందుకో నాకు చెప్పరా

ప్ర- యేమీ లేదు కాని...

క- సాఫీగా చెప్పండి లేకుంటే నాకు కుశాసావుండదు.

ప్ర- కల్యాణి నా జీవితానందం నీచేతులోవుంది.

క- నా చేతులోనేవుంటే ఇంకాకావల్సిందేముటి. అదేదో చెప్పండి

ప్ర- యేమీలేదుకాని రాత్రి మా అన్నగారు పెండ్లి చేసుకోమని పదివేలు కట్నమిచ్చారని బలవంతపర్చారు. దానికి నేనొప్పుకోలేదు. అందుపై వారికి కోపం కలిగింది.

క- (విచారంతో) అయ్యో పొరబడ్డారు. మీ అన్నగారి మనసెంత నొచ్చిందో. (ఆశ్చర్యంతో) అందులో పదివేల కట్నం ఎంతనష్టం.

ప్ర- అవును నా మనసార ప్రేమించిన నిన్ను వదలటం నష్టమే

క- అదిగాదుగాని నాగురించేకదా యివన్నీ...

ప)- అబ్బా అలాటి విచారం, నాకణుమాత్రం లేదు నీవే నా సర్వ స్వము నన్ను నమ్ము, [చేయి పైన వేసి]

సీ॥ హృదయంబు నీయందె పదిలంపరుపగ నేను
శపథంబు జేసితి, స్వాంతమందు
అధివశింపగఁ జేతు నారామవీధులఁ
లీల నా ప్రణయదోలికలయందు
సుఖదుఃఖనౌకను, చుక్కానివీవని
సాగింతుఁ జీవన శరధియందు
ప్రేమకు కులమను సీమంబు లేదని
చాటింతు మానవ సంఘమందు

గీ॥ అవిరళానంద వనవాటికాంగణమునఁ
స్వేచ్ఛవిహరింతమిఁకఁ రమ్ము శీఘ్రగతిని
ఆది దైవికముల నెల్ల నధిగమించి
స్వర్గసౌధాల నిర్మింప జంకనేల

క- [దీనంగా] మీరు నన్నింత గొప్పగా భావించారంటే నాకు పాపంకాదు.

ప)- ఏమీకాదు మన ఇద్దరిలో బేధం లేనప్పుడు

మా- మీరిద్దరొకటైతే నేనొఖణ్ణే ఒకటా సరేమంచిది నే వెళుతా

క- ఎక్కడికేం

మా- ఇంటికి

ప)- దేనికి

మా- దేనికంటే, అక్క నాజంటవదలి మీజంట కూడిందని అయ్యతో చెప్పడానికి.

క- ఒరే పిచ్చితండ్రీ తప్పుగాదు అయ్యతో చెప్తే. నీవూ మా జంటవే.

ప)- ఔను మాధవ్ మీ అక్క చెప్పింది నిజం.

మా- అట్లయితే సరే. నేను వెళ్ళనులే

ప్ర- కల్యాణీ ముందు జరుగవలసిన విధానమేమిటి

క- మీ యిష్టం

ప్ర- నేనొక్క రోజుకూడా ఇంట్లో వుండే వీలు లేదు.

క- యేం మీ అన్నగారొద్దన్నారా

ప్ర- ఇంట్లో వుంటే ఆయన చెప్పినట్లు వినాల్సొస్తుంది

క- అంటే పెళ్ళిచేస్కోవాల్సొస్తుందా... చేసుకోండి... నానుంచి మీ కేడ బాయటం

ప్రః- వుస్. ఇదో మళ్లీ ఆపిచ్చి ధోరణి మొదలెట్టావంటే పిచ్చివాణ్ణై పోతా నీ యిష్టం.

మా- మీరు పిచ్చివాళ్లయితే మాబడి పిల్లలమంతా మీ వెంటబడి వేధిస్తాం. అప్పుడేం చేస్తారు (నవ్వును)

కః- మాధవా పెద్దవార్నలాఅంటే తప్పుగాదు. (ప్రమోద్ తో) అలాఅన్నానేగాని మిమ్మువిడచి నేనుమాత్రం వుంటానా?

ప్ర- కల్యాణీ అలాగైతే రేపు యీ పాటికి ఆకనపడే గట్టువగ్గరకురా నేను నీకోరకై వేచియుంటాను.

కః- ఎక్కడకు వెళుదాం

ప్రః- మద్రాస్

ప్ర- హాయిగా స్వతంత్రజీవనంచేదాము

కః- అబ్బో అది బాగుంటుందా. లోకంలోనింద. తలిదండ్రుల కోరంధ.

ప్రః- (దగ్గరకు తీసుకొని) పిచ్చిపిల్ల ఇంత అమాయకురాలవైతే ఎట్లా ఒక పవిత్రమైనపని చేసేటప్పుడు ఇవ్వన్నీ చూస్తారా

కః- ఏమోనంండి నాకు భయమేస్తుంది తలచుకుంటే

ప్రః- (తీక్షణంగా) సరే నే వెళ్లుతా. నాతోనీకేంపని (పోబోవ)

కః- (చేయిపట్టుకుని) ఊహూఁ నేను పోనివ్వను

ప:- (పైనచేయివేసి) కల్యాణి, నీమనస్సులోవుండే అనుమాన భయాలు నాకు తెలియనివికావు. మనదేశంలో ప్రాక్తనమతాధిపతులు స్వాతిశయంవల్ల ఆత్మానాత్మ వివేచనా శక్తిశూన్యులై కోరిక తీరికనెత్తి తమకు నీచసేవ జేయడానికి కొంతమంది దౌర్భాగ్యులను తమ అస్పృశ్యతా పిశాచావేసిత శిలా హృదయాలకు బలియిచ్చారు దానికి విద్యాలేశ శూన్యులు మూఢ విశ్వాసపాటవ సంపన్నులైన వీరు దాసోహం అన్నారు. పెద్దల శాసనాలెలావున్నాయంటే.

గీ॥ కుక్క ముట్టిన యన్నంబుఁ గుడువఁవచ్చు
పంచజనుం ముట్టుటే, యిట అంటుదనము
మూషికము లెప్డు సేవించు మూర్తిముఖముఁ
జూఁడగారాదు, మానవసోదరుండు

కాబట్టి ఇలాటి ఖర్మఖండాలురైన పెద్దలకంటె జాతిఖండాలు లే వుత్తములు.

క:- అందుకే ఇలాటిదౌర్జన్యాలన్నీ సహించలేక హరిజనులు తమకు సమాన సభ్యత లభించే యితర సంఘాలలోకి దూకుతున్నారు దాంతో మన సంఘం సన్నగిల్లుతుంది.

ప:- కనుక యీలాటి తలాతోక లేని సంప్రదాయాలకు గొర్రెదాటుడుగా తలయూచటం ధీమంతుల లక్షణంకాదు అదిగాక

గీ॥ వేదశాస్త్రములందు, నేగాథలందు
నంటరానట్టి వారుంను రనఁగ లేదు
వేద సూత్రాత్మకంబుగాఁ వెలయుమతము
తోడిసోదరులను కడఁద్రోయఁగలదె?

క:- ఏదేశంలోనైనా అంటరాని ఆచారంవుందంటి?

ప్ర:- ఎక్కడా లేదు. ఏదేశమందైనా ఏజాతియందైనా వుత్తమ జన్ముడైన మానవునికి అంటరాని తనము కల్పించిన బుద్ధిమం

తును యింతవరకు పుట్టలేదు. యికపుట్టదు మానవులు సమా
నులు ప్రేమ పవిత్రం.

క;- ఆహా! యిప్పుడు నా అనుమాన భయాలన్నీ అంతరించినై.

ఉ॥ దబ్బరమైన మబ్బుతెరఁ దప్పులఁబాపితి, జీవితేశ! నన్
గొబ్బున సత్యభాస్కరుని క్రొంజెలి చాయలఁ దేల్చి, అచ్ఛపుం
నిబ్బరమైన తెన్నునది జూపితి! జీవిత ధన్యనైతి, నా
ప్రచ్చెదు రాగ హృత్సుమముఁ రాల్చితి నీపదమందు నేలుమా.

ప్ర;- సత్కార్యాచరణానికి ప్రథమంలో ఎన్ని యాటంకాలు కల్గినా
ధైర్యంతో ఎదిరించి మనబోటి యావ్వనులు మార్గదర్శకంగా
పనిచేసి, సంఘదురాచారాలను తొలిగిస్తేనే కాని దేశోన్నతికి
కొంత దోహదం కలగదు. కాబట్టి మనమిప్పుడు వర్ణాంతర
వివాహమాడి సంఘోన్నతికై పాటుబడడమే నామనోనిశ్చయం

క:- మీయిష్టమే నా యిష్టం. నిజంగా యింత పాడు సంఘంలో
వుండి టంకంటే, ఎక్కడనో పవిత్రమైన జీవనం గడపడమే
బాగు. ఔఁ అయితే రేపేనా మన ప్రయాణం.

ప్ర:- ఔఁ ఔఁ తప్పకుండా రేపే. మళ్ళీ పిచ్చియూహాలు పడకేం.
సరిగ్గా యీ వేళకే,

మా:- మరి నేనో.

క:- నీవు మాతోనే నిన్నువిడచి మే ముంటామా.

(వెనుకనుండి తండ్రి రామన్న ప్రవేశం.)

రా:- ఏం బుద్దేయిది. ఎందుకొచ్చారిక్కడికి.

మా:- (తండ్రి చేయిపట్టుకుని) పొలానికెళుతున్నామయ్యా.

రా;— యీ నెవరు ఎందుకొచ్చాడిక్కడికి.

మా:- ఎవరో మాకు తెలీదు. షికారుకొచ్చాడట. మేము పాడుదూ
వెళ్తావుంటే విన్నాట్ట, బాగుందట, అందుకేవచ్చి నన్ను బతి
మాలి, పాడించి, యీ మిఠాయి పొట్లమిచ్చాడు.

ప్ర;- మీ అబ్బాయి చిన్నవాడే కాని, చక్కని పాట ... ... ...

రా;- అయితేమాత్రం మీరు పెద్దకులస్థులు అందులో ఫుచదుకున్న వాళ్ళు. మాబోటి అంటరానివాళ్ళ పిల్లలతో కులాసా చేయటం మర్యాదేనా ?

క;- వారు మంచివారు మమ్మేమీ అన్నేరు.

రా;- ఏడ్చావు పూరోక్.

ప్ర:- ఇంతమాత్రానికే కోపమెందుకయ్యా.

రా;- కాదండీ, మేమెంత నీచజాతివాళ్ళమైనా మాకూ అభిమాన ముంది.

ప్ర:- నేను లేదన్నానా మనుష్యులంతా సమానులే. అసలు కులంలో ఏమున్నది గుణం మంచిదైతే అంతా పెద్దవాళ్లే.

రా:- సరే మాటలకేం లేండి ఆనా చెప్పొచ్చు. (పిల్లలను) రాండి వెఱ్ఱిమొహాలు. (ఇద్దరిని లాగుకొని వెళ్ళును.)

ప్ర;- (యోజించి) నా కల్యాణి మాత్రం ప్రకారం రాకపో ఫునా అదెన్నటికి జరుగదు. నావలెనే ఆమెకు మాత్రం ప్రేమ లేదా ?

మ॥ ప్రణయాందోళిత డోలికాహృదయమే పద్మాక్షి యక్షిద్వయీ
జనితప్రేమ సుమాస్త్ర సంక్షుభితమై చాలుక యదేహాన యే
యుని మేషాంగనయైన శాంతినిడునే యాప్రాణికిన్ యొక్క కో
గనిదాసంబున మంచు పేరొకటిడంగాఁజెల్లునే యుర్వరన్.

ప్రథమాంకం — సమాప్తం.

# కల్యాణి



## ద్వితీయాంకం

(మొదటిరంగం)

(మఠంలో భక్తులు కూర్చొని యుందురు. శర్మ, శాస్త్రి బ్రహ్మచారి వేషాలతో చెరొక ప్రక్క నిలబడి కైవారం చేయుచుండగా, స్వామీజీ ప్రవేశం)

(కైవారం) శ్రీ మదఖిలార్యావర్త, వేదమతాచార్య, సకల విద్యాసారసముచ్చయ, సులక్షణ సారసంగ్రహ, లీలామానుషవిగ్రహ శబ్దరత్నాకర, అస్ఖలిత బ్రహ్మచర్య దీక్షాదక్ష, యోగాభ్యాస దర్పణ ప్రతివాది భయంకర కామినీ జనసంతాన కల్పద్రుమ, కవిరాజ విరాజిత సకల ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ శుంభత్కుంభినీ కంఠీరవాద్యనేక బిరుదాంకిత శ్రీ శ్రీ జగద్గురు జీవన్ముక్త అవధాని శిరోమణి స్వామీజీ బహుపరాక్.

స్వా:- భక్తులారా! మేము తెలపయ్యబోవు శ్రీసూక్తులను చక్కగా నిశ్చల మనస్కులై విని తరించుడి. (పురాణం)

చం॥ తనువులు బుద్బుదంబులిక దారసుతాదిక భోగభాగ్యముల్
గనఁ నదియూర్మి సధఃపతన కారణముల్ భువివచ్చునప్డు, చిఱి
గిన పుటమని తెగలడె కిల్బిషుడై దివికేగునప్డు, మో
దిన ప్రతి యామ్యకింకరులు దేలిక జేయుటకైన, నొక్క కా
సును గొని పోని వెఱ్ఱులిల జొంగలు గక్కుచు జేవసావలన్
నెనయగ లేని బాధలిడి యేడ్వగ జూచుచు నుంద్రుగాని. రా
ముని పదచింత నాత్సరత ముష్టిగ నంధుని కంగహీను కేన్
దమకుఁ గలట్టిదాని నొక దమ్మిడియైన నొసంగరీ భువిన్.

(స్వామి పైపద్యాలకు తాత్పర్యం చెప్పే సమయంలో భక్తులు చంపలు వేసుకొనుట దండములు పెట్టుట జరుగును. శర్మ, శాస్త్రి

కనుగీటుకొనుదురు. పురాణం ముగించిన తర్వాత తీర్థమిచ్చును.
యంత్రాలు మంత్రాలు డబ్బువసూలుచేయుట జరుగుచుండును.)

భక్తు - (శర్మతో) సాములారూ నాకు పిల్లలు పుట్టేటట్టు ఏమన్నా యంత్రం యిప్పిస్తారూ. పురుటికోజు మీకు మంచికట్నం యిప్పిస్తాగాని.

శర్మ:- మంచిది నీభార్యను తీసుకురావాలాయి అదెంతపని.

భక్తు- ఇంకా పెళ్ళిచేసుకోలేదు బాబూ.

శర్మ:- నీదుంపదెగ వెర్రినాయనా పెళ్లాం లేకుండా పిల్లలను ఎలా కంటావాయి.

భక్తు;- నీ కెందుకోయి పెళ్లాం సంసారం చేయలేనివాడికి అని అంటు న్నారు. అంతా చేసుకోమంటారా. సామీ.

శర్మ;- ఫరవాలేదు చేసుకో గామూ పహిల్వానంత వాడవు మా మంత్రబలంవల్ల నీభార్యకు సంతానం కలిగేటట్టు చేస్తాం.

భ:- మీరామాత్రం హామీ యిచ్చారంటే రేపీపాటికి పెండ్లిచేసు కొంటా యింత మీదయవల్ల పిల్లో బిరకాయో కలిగిందంటే నవ్వేవాళ్ళ మొహాలన్నీ మాడిపోతాయి.

(మ్రొక్కును. అందరు నవ్వెదరు.)

శ;- ఇక అంతా వెళ్ళవచ్చు రేపీ వేళకు యింకా మీ స్నేహితుల యుక్తంగా వచ్చి స్వామివారిని సేవించుకుని మీ మనోభీష్టా లను నెరవేర్చుకోండి (భక్తులు వెళ్లుదురు.)

స్వా.- (నవ్వుతూ) (My dear) శిష్యా త్వరగా వూళ్లో కెళ్ళి, రావల సిన డబ్బు వసూలుచేసి దేవిగారి ఆరాధనకు కావలసిన పూజా ద్రవ్యాలు సేకరించుకొనిరండి.

శ;- (Yes Your Majesty) (శిష్యులు వెళ్ళుదురు,)

(కాంతం ప్రవేశం)

స్వా;- (Hollow Mydear Kantam) దయచేయండి దేవిగారు.

కాం:- (దగ్గరకూర్చొని) ఓహో దేవరవారి బూచివేషంలో ఎంత సేపుంటారు. (గడ్డం లాగబోవును.)

స్వా - (Allright) నేనే తీసేస్తాగా మీకెందుకీ శ్రమ. (గడ్డంతీసి) సరే గాని కొద్దిగా స్వాములవారి జిహ్వాభిషేకం చేసుకుని తరుణో పాయం జూచుకో.

కాం:- (సీసా తెచ్చి నవ్వుతూ) మీ ఘోటక బ్రహ్మచర్యంలో నాకిది వరకే తరుణోపాయం లభించింది. ఇప్పుడు యీ సారాబుడ్డికి కూడ లభిస్తుంది. (ఇచ్చును.)

స్వా:- (త్రాగి) ప్రేయసీ నీ అధరామృతమును గ్రోలి యీ దాసుడు కూడ తరించెననుటకు సందియమా.

కాం:- ఓహో స్వాములవారు భద్రాజు కైవారాలుకూడ భట్టీ పెట్టారే.

స్వా:- Yes మనం all in all మనకురానిదే లేదు యీ నిమ్మకాయ వాట ప్రపంచములో నేటివరకు మాప్రతాపాలు దేవిగారికి విన్నవించుకోక పోవటం మహాపరాధం. (లేచి) ఓ సంపన్నం ధాయిని. ప్రేమవాహిని, కామిని, అవధరింపుము మదీయ ప్రతాపాలు.

సీ. అవతరించిన నాడె అమ్మను పంపితిఁ
బిచ్చి ప్రపంచంపు పీడవదల
చదువు కాలమునందె సంగడీఁడులఁజిక్కి
గడియుంచితిని, మొనగాని బిరుదు
డబ్బు విచ్చలవిడి నబ్బురుండమి దండి)
నాహుతిచ్చితి నాదు వ్యసనములకు
ఆస్తిపాస్తులను దద్దమ్మ వట్లాకై
మార్వాడి పొట్టన మాలు పెడితి

గీ, కల్లు సారాయి భగవతి కరుణ బడయఁ
ధనమదాంధుల శిరముల దునిమినాడ

మానవాశ్రిత కార్యముల్ బూనియుటుల
యీ అనంత జగాన నిక్కెలుచుంటి.

కాం;- భళీ. యికచాలించండి మీ ప్రతాపాలు నేవెళ్తా.

స్వా:- ఆఁ మర్చాను. ఇదిగో మీ ప్రమోద్ ... ... ...

కాం:- ఆఁ తెల్సింది. ఒక కడహారి పిల్లతో కాళ్ళకు బుద్ధిచెప్పావట అంతేకదూ.

స్వా:- అంతే, కాని యిదేం రోగం. మాలముండతోనే, దానమ్మ కడుపుకాల అదీ భలేదే.

కాం:- అది యౌవ్వన రోగం. శుద్ధబ్రహ్మచారి గానికి నీకేం తెలుసు దాని తత్వం ఎట్లుంటే.

గీ. సమధికానంద డోలికల్ సంతరించి
రాణమొప్పారు బ్రియముంపు రాణిగాదె?
తలపుకేనట్టి కాంతను, తార్ప జూడ
బలిమిచే, పంగనామాల నలఁదుటాను.

స్వా:- నీ గొంతు నొక్క. నీమనసు గ్రహించామని నేనంటే, నాకే బాగా బుద్ధి చెప్పావే. అయినా, నాయౌవ్వన రోగానికి ఎప్పటికప్పుడు నీవే తగుచికిత్స చేస్తూవుంటె ఆ తత్వం తెలుసు కోవాల్సిన అవస్థ నాకెందుకు.

కాం:- మిడికావు కాని... ... ...అందుకే మొన్న రాత్రి మావారు నేను ఎంత బలవంత పరచినా పెండ్లికి ఒప్పుకోలేదు. ప్రమోద్ పది వేల కట్నాన్ని కూడా కడ దోశాడు.

స్వా:- ఆహా. పదివేల కట్నాన్ని కూడా వదిలాడంటే. ఆ అందాల సుందరి ఇతని అమాయిక హృదయాన్ని చురుక్కుమని హావ్వాయి చువ్వాలె అమాంతంగా ఆకాశ పథానికెత్తుకు పోయిందన్న మాట.

కాం:- అవును. అంతే.

చ. నవనవ లాడు యవ్వనము నాట్యము సేయఁగ నుంగవర్ణ మదిన్
జపులు బుకెత్తఁ లేవలపు జల్లుఁ వెన్నెలల్లు సెజ్జపై
వివశత మేల మాడ, సుమవిల్తుఁ మానుని మోహనాంగునిన్
గవయఁగ లేని ముద్దియలు గంగమ కౌగిలి డాయు టేతగున్.

స్వా:- భలే మాటన్నావు. భవదీయులు వచ్చేటప్పుడు మీ ముసలి పీనుగేం చేస్తున్నాడు.

కాం:- తమ్ముని వియోగం వల్ల హృదయావేదనోన్మత్తుడై మంచం పట్టడం చేతనే యీ రోజు ఇంత సేపు యీ సంభావనింతా మశి సేవ చేసుకోగలిగాను:

స్వా:- అయితే యీ దెబ్బతో మీవారు ప్రాణేశ్వరిని మాకు వదిలేసి పరమేశ్వరుని సేవించుకోరు గదా?

కాం;- [తెచ్చి పెట్టుకున్న కోపంతో] అలాఅన్నావంటే అగ్గికురిపిస్తాను జాగ్రత. (పెడ ముఖం పెట్టును.)

స్వా:- ఓహో మా దేవి గారికి సుగ్గుం గొడవ లేకుండానే అంతలో ఆవేశం కలిగిందే.

కాం;- అవును. ఆడదంటే అంట్ల వెధవలకి కూడా అహంకారం కలుగుతుంది. యీ దేశంలో ఆడదై పుట్టడం కంటే గాడిదై పుట్టుట మేలు.

స్వా;- (గడ్డం పట్టుకొని) *My Dear Empress* ఆడియేన్ పై యింతఅగ హంకరిగితే ఒక గడియలో యీ వెధవ బ్రతుక్కి తిలోదకా లిస్తాడు.

కాం;- (స్వామి నోరు మూసి) యీ సారి యిలాంటి అఘాయిత్యం మాటలన్నారంటే నన్ను చంపుకున్నట్టే. ప్రియుని మనస్సు తెల్సుకోలేని వాడవు మహా ప్రతాపవంతుణ్ణంటావే. పైగా (నవ్వు) యీ పాప పరిహారార్థం యీ పండొకటి నాచేత తినాలి. (తినిపించును.)

స్వా:- (నవ్వుతూ) పురుషుడెంత ప్రతాపవంతుడైనా ప్రియునిముందు పచ్చిదర్భకరే.

శాం:- (చప్పుడువిని) మీ శిష్యులు వస్తున్నట్టుగా వుంది. ఆలస్యమైంది వెళ్తా, (వెళ్ళబోవుచుండును)

స్వా:- సరి వెళ్ళు రాత్రికి నేను వచ్చి దొరగారిని ఓదార్చాల్సివుంది.

శాం:- చిత్తం ఎంత అనుగ్రహం పాపం. (వెళ్లును)

(Sarma & Sastry enter with bottles)

స్వా:- *What Brothers Too Late* పురాణాలు, పూజలు చెప్పి జిహ్వ పీక్కుపోతూవుంటే అందులో ఏకాంతం మరి యమయాతన (సీసా లాక్కొని త్రాగుచుండును)

శ:- *What To Do Wine Shop* వెధవ. తన షాపును మూడు ముక్కల ముతాకు ముడుపు కట్టాడు. అక్కడకు మాస్వామి వారి గొంతు పురాణంలో పొర్లాడి ఏడుమ్మెప్పాటిక స్మృతిలో ఏడుస్తుందని కూడ చెప్పాను.

స్వా:- కొంప తీసి చెప్పావా ఏంటి. (త్రాగును)

శ:- చెప్పినా పర్వాలేదులెండి. స్వామి, వాడూ మన శిష్యకోటిలో చేరినవాడే. మన ప్రభ విశ్వవ్యాప్తమౌతూంది.

శాస్త్రి:- (శర్మతో స్వామిని జూపుతూ) సిద్ధాంతాలు పాడుగాను ఆదేంటి. మన కీదినం ఏకాదశీ వ్రతమే.

శ:- (స్వామితో చేతులు జోడించి) హే స్వామిన్ భవదీయ కటాక్షమునకు గురియైన మీ ప్రియ శిష్యపుంగవుల గతేంటి.

స్వా:- హే శిష్యా మీ దేశికోత్తములు పరిపూర్ణులయినగదా మీరు ముందు ప్రగతులు. (సీసా యిచ్చును. శర్మ త్రాగుచుండును)

శా:- (ముందుకు నడచి)వీళ్దరి లక్షణాలుబట్టిచూస్తే పగటిభాగవతం ఆడి నట్లుగా వుంది. నాగతో. అడకత్తిలోని పోకలాంటివి. ఏమైనా 'అపోజు' చేశానా విరుచుకు పడ్తారు. ఎన్న కర్తవ్యం

చెపుమా.( కేలు మోడ్చి)“లాభ్యేక్ష్యంతయు లేదు” (అనువర్యం చదువు చుండగా)

శ.:- (శాస్త్రి కేపు చరచి, సీసా చేతికిచ్చి) ఏం గొణుగుతున్నావోయ్ బంకించంద్ బహదూర్.

స్వా:- *Shut up* పెద్ద తాగుబోతుల్లాగా.

శ;- (తూలుతు)ఏం. మేమంత టక్కువ ట్రాగేమను కున్నావా. యీగాణే మహా ట్రాగాడట. Great Insult What Sastry ట్రాగేం. ట్రాగుటున్నాం. ట్రాగుటాం.

స్వా;- తమాషా కల్లా అన్నానోయి గురుడా. నిజం చెప్పాల్సొస్తే మీరు నన్ను మించారే వైను భవానీ కైంకర్యంలో. కాని ఒక్క విషయం. మనోగతం చేసుకున్నారంటే మీ అంత దిగ్గంతులు త్రిలోకాలు దివిటీపెట్టి వెతికినా, దొరకరనడం హాస్యోక్తి కాదు. ఏమంటే.

ఉ. త్రాగిన ద్రాగఁవచ్చు, వెయి డ్రాములనైననుగాని, ప్రేతముల్
డాగరు మాటలాడు, ముఖడంబముఁగల్గి త్రిదోషి ఫ్రూలె బల్
వాగుట, పిచ్చివానిబలె వాలకముంజెడి మూల్గుచుంటచే
దాగునె! మామకీనధన దర్ప వినాశకర ప్రథావిధుల్.

శ;- పూర్వజ్ఞానం కల్గించినందుకు ధన్యుణ్ణి.

శా:- శిరోమణి గారూ సాయించింది Quite Right పెద్దలేమన్నారు

గీ. సీనియర్ మోష్టుపేండుల శిక్షలోన,
డ్రింకు సాగించ మన్నారు, డింభకులను
త్రాగినను జంట్లిమేనుగా గ్రాలిజనుల
ద్వ్యాపు సేయొచ్చు, కండ్లకు దుప్కియిచ్చి.

స్వా:- మీ శషభిషలన్నిటికీ స్వస్తిచెప్పి, నేను చెప్ప బోయే శుభవార్త వినండి.

శా:- (తూలుతు, పాయించండి పార్
స్వా:- ప్రమోద్ మాల పిల్లతో మద్రాసుకు వచ్చి, శ్రీవల్లభుడు చింతా
     కాంతుడై మంచంపై ఉల్టా.
శ;- [తూలుతు లేచి) వహ్వా. వహ్వా. ఇక మన కాషులు పలామణి.
శా;- [గ్లాసులో సారా యిస్తూ] ఒకక్క షుక్క వేసి మరీవి శేషాలు
     చెప్పండి స్వామీ.
శ;- హాలో శిష్యం. మనకూడా ఒకక్క షుక్క షురుక్కు మనిపించు
     సలాం షేస్తాం. [సలాం చేయును.]
శా:- O. K. కృష్ణార్పణమస్తూ (త్రాగి శర్మకిచ్చును)
స్వా:- ఇలా తూలి తందనాలాడ రంటే గోల్డెన్ ఛాన్సు పోతే దొర
     కదు. మీా యిష్టం.
శ:- శలవియ్యండి. (శాస్త్రితో) క్వైట్ గా కూర్చో వ్రాయిఃకురా.
స్వా:- ప్రమోద్ తో లేచిపోయిన ఆ లేడిపిల్ల ఎవ్వరైయుండును.
శ:- (యోజించి) I See ఆరోజు రంగాపురం పొలాల్లో పట్టుకున్న
     వడుచుకావచ్చు.
శా:- Right తప్పక అదే ఐవుండాలి.
స్వా:- ఆ కథేంటోయి.
శ:- యీామధ్య మేమొక పిల్లపైబడితే ప్రమోద్ విడిపించి నాచేతి
     సీసాతో ఒక దెబ్బకూడ తిన్నాడు
శా:- ఆ దెబ్బతో అతని పని కూసిందను కున్నాము.
స్వా:- ఓహో తప్పక అదేపిల్ల......... అంత సుందరాంగియా?
శ:- Yes అది కడజాతిదైనా కనకంపు బొమ్మ.

ఉ॥ చల్లని వెన్నలం గురియు, చందురునిన్ హసియించుగాదె, యీా
   పల్లవపాణి మోము, మొనవారి గిరాటులు వేయు గుబ్బియల్
   మెల్లర మానసంబులను, యిట్టులు పాతరలాడునట్టి యు
   త్ఫుల్లములైన కన్నుఁగవ పోసిన బంగరు బొమ్మఁనాఁదగుఁగా.

స్వా:- కనకంపు బొమ్మకై కన్నతండ్రి)కంటె ఎక్కువగా పెంచిన, అన్న నన్యాయం చేశాడన్నమాట.

శ:- అన్యాయం వంటి తమ్ముని వియోగం లో, విషాదగీతాలాలా పిస్తున్నాటడ.

శా:- పాపం ముసలితనంలో కసుమరోగం పుట్టినట్టుందే.

స్వా:- కాని యిదంతా మన మేలుకే. Best Opportunity దొరికింది.

శ:- అదేంటో అనుమానం లేకుండా అన్వయించండి స్వామి.

స్వా:- ఏముందోయి శ్రీవల్లభుని ప్రోదార్చడానికి వెళ్ళి కాలచక్రంలో అతని బుర్రను గిర్రున తిప్పితినా. చేతినిండాడబ్బు పొట్టనిండా పెగ్గు దీన్నే అంటారు Politic దెబ్బ.

శ;- భేష్ ఏముంది మోపీ మీకు మినిష్టరీ అయినా యిచ్చాను గాదు యిస్తేనా, ముల్లోకాలను ముగుదా దేసి ముప్పయిఆరు సముద్రాలలో ముంచేవారు బాబూ.

శా:- భేష్ కాళిదాసు కంటె కమ్మగా వర్ణించావోయి. (నవ్వును)

శ;- నవ్వినే నవ్వేవు గాని యింగ్లీషులో నవ్వకు, వక్రీచనస్తరంతా.

స్వా;- ఇక గురాలొట్టాభట్టీయాలతో పనిగాదు. కర్తవ్యానికి గడంగాలి అగూను పురాని అంతా తర్వాత చెప్తా. మరం వ్యవహారాల సమయమైంది. వెళ్దాం. (స్వామి వెళ్ళును)

శా;- (వెళ్తు) అస్మదీయులు కూడా నిష్క్రమించుచున్నారు.

శ:- (వెళ్ళుతూ విచారంగా)

గీ. మూడు నాళ్ళ ముచ్చటయైన పాడు జగతి
నట్టి వలకాంకలంగూడు అన్నువాసి
వదన మను సీకరంబుల వడయ లేక
పాత్రయమున్ బుమ్ము నాబోటి పంద యున్నె?

— ♦ మొదటి రంగం సమాప్తం ♦ —

## ద్వితీయాంకం — రెండవరంగం

(శ్రీవల్లభుడు యింటిలో కుర్చీపై కూర్చుని)

**ఆహా! ఏమి యీ కాల వైపరీత్యము.**

సీ. నాజూకు పేర నన్నెట్టెఁ బెట్టెను
మనభారతీయ సమ్మార్గవంబుఁ
ఆటల పేరిట నాడంగులను జేసె
సప్రతిహత వీరులైన బలులుఁ
విద్యల పేర నవిద్యలఁ బ్రబలించెఁ
విద్యామహోద్యాన వీధులందు
ధర్మంబు పేరిట దగ్ధంబు గావించెఁ
వర్ణాశ్రమంబులు వఱలు భువిని

గీ. ధిక్కు మాలిన భ్రాంత దివ్యభూమి
ఎంక నెన్నెన్ని మొక్కల నీనునొక్కొ!
మరిడి జాఢ్యంబు పాశ్చాత్య మమతవల్ల
తలఁచినఁ గొలంది గుండెలు తఱగిపోవు.

[యోజించి] కాదు కాదు నాతమ్ముని మరచుట మాత్రం మహాదుర్లభం వాడు కామవ్యామోహంలో జిక్కి నన్ను మరచి పోవచ్చు ఇలాంటి అన్యాయిత్యాలు జరుగుతాయనే మాపూర్వులు సంస్కృతాంధ్రాల లోనే చదువు చాలించి పెద్దవాళ్ళ భయభక్తుల్లోవుండి డబ్బు పేరు ప్రతిష్ఠ సంపాదించగలిగారు. (యోజించి) నిజం పారమార్థిక దృష్టితో చూస్తే మనుష్యులంతా సమానులే. కాని సంసారం సక్రమ పద్ధతిలో సాగించడానికనే గాబోలు మన పెద్దలు వర్ణాశ్రమ ధర్మాలు అమలులో పెట్టారు. నా తమ్ముని విషయం నా మాట్లకు సరిపడినా సంఘం ప్రారుకుంటుందా పరమార్థి సమభావ సంచారం సాగిస్తా దంటే ఏపనీ సవ్యంగా వ్యామోహంతో ప్రవేశలా పెక్కతో చేయరు. మన నవనాగరికులవలె జల్లని చిల్లరి తనంతో దైవాన్నే మరచి తేనె

బూసిన కత్తులవలె అబద్ధాలకు అధి దేవతనై చెరించరు. (చికాకుగా) యీ సిద్ధాంతాలతో నాకేంపని నా మనస్సు నా చేతులో లేనప్పుడు

ఉ॥ మాతనుఁ బిత్రుఁ బాసితిని మానినియౌ కడుమాటకారి నా
చేతము సమ్మదించదట చింతలుబాపి మదీయవంశ ప్ర
ఖ్యాతిని నేలనొక్క కసిగందయినన్ గలుగంగ లేదు దు
ర్నీతిని బోయె సోదరుఁడు రిక్తుఁడ నైతిని విశ్వభంగులన్.

(కనుమూసి కుర్చీపై వ్రాలును)

—: స్వామి ప్రవేశం :—

(తనలో) భలే సంకల్పశుద్ధంటే నాది. అనుకున్నదల్లా అర్థించ కుండానే అమృతమట్టు అబ్బుతూవుంది. అదే మన్లోఉన్న తమాషా (యోజించి) అవును ప్రమోదే నాఆనందాల కడ్డంకి సాకాంతంగూడ అతని వల్లనే అప్పుడప్పుడు చివికి పోతూ వుండేది. దైవానుగ్రహంవల్ల అతను కాస్తా అంటరాని పిల్లతో అంతర్ధానమైనాడు. ఇప్పుడు నా కార్యం సాధించడానికి మంచి అదను. (శ్రీవల్లభుని చేరగా అతను లేచును)

శ్రీ:- నమస్తే స్వామీజీ! దయచేయండి (ఆసనం జూపును.)

స్వా:- కామితార్థఫలసిద్ధిరస్తు (కూర్చుండును)

శ్రీ:- స్వామివారి రాకవల్ల దాసునిగృహం పవిత్రమైంది.

స్వా:- (నవ్వుచు) ఆపరమశివుని ఆజ్ఞ. మాబోటి పెద్ద లెచ్చటనున్నను పరిసరప్రాంతములన్నియు పవిత్రములే.

శ్రీ:- తమబోటి మహాపురుషు లుండుటవల్లనే యీ పాడులోకం కొంతవరకైనా ధర్మాన్ని నిలబెట్టుకో గలుగుతున్నది.

స్వా:- నిజము వచించితివి. అట్లుగాని నాడువిశ్వ ప్రళయం సిద్ధం. మాదృసులు ధర్మమును ప్రతిపాదింతురు. మీబోటి అధికారులు దానిని పాలింతురు

శ్రీ:- ఇదంతా మీచలువ.

స్వా:- ఇదేమి యీ రోజున నీ ముఖారవిందమే మో. శోభ తగ్గినదే.
శ్రీ:- అయ్యా మీరు దివ్యజ్ఞానులు, త్రికాలవేదులు, మీకు తెలియని విషయ మేముండును.

స్వా:- (కన్నులుమూసి) ఓహో తెలిసినది. ఇదియా సంగతి దుర్మార్గము, దూష్యము, కలిమాయ నీ సోదరుడెంతో సీలము కలవాడను కొంటిని. యింతకు ముందే మాకు విన్నవించు కొనినమేము శ్రీముఖమున శలవిచ్చి నిల్పియుండువారమే.

శ్రీ:- స్వామీ, నిజముగా ప్రమోదుడు శీలం కలవాడే. నామాటకు గీటుదాటేవాడుకాడు. కాబట్టి యింతకు తెగిస్తాడని కలనైన దలపలేకపోతిని.

స్వా:- అటులైన యీ అపభ్రంశము జరుగుటకు కారణమేమి?

శ్రీ:- అయ్యా మేమీ మధ్య ఆతని వివాహం స్థిరపరచి తెలుపగా నిరాకరించెను. దానిపై నేను కఠినముగా మందలించితిని. ఇంతే కారణం.

స్వా:- ఇంతమాత్రమునకే పెద్దలను పెరటి బచ్చలకూరగా జేసెనా ఇదంతయు ఆధునిక విద్యా సంస్కృతియన్నమాట

గీ॥ విద్దియలనేర్చిన కొలంది బుద్ధిసున్న
రద్దిపాలగుc వంశ మర్యాదలన్ని
యుద్ధమతులను సేయని దిదియెవిద్య!
విశ్వమయుcజూపు రధ్యయేవిద్యగాక.

శ్రీ:- ముందు కర్తవ్యమేమీ పాలుపోవటం లేదు. ప్రమోద్ లేని నాజీవితం... ... ...

స్వా:- ఏమీ యింకను ప్రమోద్ పై మమత వీడ లేదన్నమాట.

గీ. కామలోలుc డైనట్టి యీకాముకునకుc
గర్మ ఖండాలునకు నేడ్వధర్మమునెు?

కుళ్ళిపోయిన వ్రేలుపై గూర్మి దక్క
నఱికి వేయుట మేలౌను నరున కెపుడు.

శ్రీ:- నిజం సెలవిచ్చారు. కాని నేను ప్రపంచంలో ఏకాకిని.

గీ. మొగ్గప్రాయము నుండి ప్రమోదము సాకి
సంతు లేక మోహావేశ స్వాంత లతికఁ
ఒల్లవింపగఁ జేసి నేఁ బ్రతుకుచుంటి
సింక మనుటెట్లు నా దెసన్నిసడింప.

స్వా:- (విచారంతో) ఆహా నీవిషయము మామనస్సునకు తట్టినపుడెల్ల హృదయచ్ఛిద్రము చేర్పడుచున్నది. (యోజించి) సరి మంచిది ధర్మసూత్రములు కొన్ని అతని పురప్రవేశమునకు కొంత సాయముగా నున్నవి.

శ్రీ: [శాంతంతో] స్వామీ ప్రతిలేని ధర్మశాస్త్రము లంగీకరించిన తర్వాత ఇక నేను సంఘానికి భయపడాల్సిన పని లేదు.

గీ॥ ధర్మముల పోతపోసి యీ ధరణిపంపు
మిమ్ముబోలు మహాత్ముల దమ్మికఁటి
తనను దాసానుదాస హృద్వ్రతముఁ గూర్చ
మన్సహ్లాక్లేశ కీలిత మానముసంద

స్వా:- పిచ్చివాడా మేము తలచిన. ధర్మశాస్త్రము లేల కాని......
శ్రీ:- నిస్సందేహముగా శెలవియ్యండి మహాత్మా
స్వా:- ప్రమాదకర మారుడా బుద్ధాలిని విడిచివచ్చిననే కదా మేము తీర్థాదులచేత వానిని పరిశుద్ధాత్ముని జేయుట.
శ్రీ:- (దుఃఖముతో) అమ్మో యీ దేయిష్టాడొచ్చిన సంకటం నామాటనే పెడచెవిని బెట్టిన పోను యితరులకు సాధ్యపడటం ఆకాశకుసుమ మనుకుంటాను.

స్వా:- [నవ్వి] శ్రీ వల్లభా ఇటు మాడుము ఎంత ధైర్యహీనుడ వైతివి. యీ మాత్రమునకే యింత విచారమా.

శ్రీ;- (ఆశతో) స్వామీ. (లేచి) నా ఆశాజ్యోతులు మీరే "అన్యథా శరణంనాస్తి"

స్వా;- వత్సా విచారపడకుము సర్వముమాకర్పించిన శిష్యుని కాపాడుట మాధర్మము ధైర్యము వహింపుము మేము స్వయముగా వెళ్లి పని సాధించెదము.

శ్రీ;- ధన్యుణను తాము దలచిన కానిపని లేదు.

స్వా;- యీమాత్రపు పనికి మా శిష్యులు చాలుదురు. కాని యిక మేము స్వయముగా వెళ్లిన అసాధ్యమనునదియుండదు.

శ్రీ;- దేవరవారు సంకల్పమాత్రంలో రప్పించ గలరని నాకుమాత్రం తెలియదా స్వామీ.

స్వా;- [నవ్వి] నిజము వచించితివి గాని

గీ॥ అల్ప కార్యానికై నిల నగ్గి సేయు
యోగ శక్తిని( బనుచుట యోగ్యమగునె?
యూరపిచ్చుక పైని బ్రయోగ పరుప
ననుచితముగాదె బ్రహ్మాస్త్రమయయ మాకు.

శ్రీ;- అవును నిజం సెలవిచ్చారు

స్వా;- ఇదే నా శిష్యులు వచ్చుచున్నారు (శిష్యులు ప్రవేశించారు) (శిష్యులతో) యీ జమీందారుని తమ్ముడు ఖర్మఖండాలుడై వెళ్ళెను మనమాతనిని తోడి తేవలయును.

శి:- చిత్తం. యీమాత్రానికే తాము విజయం చేయవలెనా.

స్వా:- సత్యమే కాని శ్రీవల్లభుడు మాప్రియభక్తుడు. మేము స్వయముగా విజయము చేయనిది మాస్వాంతమునకు శాంతి యుండదు. కాబట్టి "కింకర్తవ్యతామూఢులు" కాకుడు. (లేచి) మాకైభక్తులు వేచి యుందురు మేము పోయి వచ్చెదము. (వెళ్ళును.)

శ:- (ముందుకు నడచి శాస్త్రులో) చూచావా యీ మనవాడి బుర్ర ఒక్క ముక్కా యింపిచ్చి వెళ్లాడు.

శా:- What ''కింకర్తవ్యతా మూఢులన్నా'' డేంటి.

శ:- (నవ్వుచు) అనగా ఖర్చుల క్రింద డబ్బు లాగమన్న మాట.

శా:- I See నీవు మాత్రం సామాన్యుడివి గానివా. వెంటనే గ్రహించావు. అందుకే ''తెలివొకరి సొమ్మా సాలిగురవమ్మా'' అన్నాడొక బుద్ధితక్కువ పెద్దమనిషి పూర్వం.

శ;- [శ్రీవల్లభునితో] దొరగారూ ప్రిమోద కుమారు డెక్కడున్నాడని మీరాయూహ.

శ్రీ: తప్పక మద్రాసులోనే యుంటాడని నాఅనుమానం.

శా;- అబ్బో. మద్రాసే ఎన్నాళ్ళుండి ఎన్నితంటాలు పడాల్సొస్తుందో.

శ:- అగుగాక జమీందారు గారి పనికంటె ఎక్కువేముందోయి మనకు వారి శ్రేయమే మన శ్రేయము.

శా:- అంతే ఎటొచ్చీ డబ్బుకే నచ్చేది ప్రమాదం.

శ్రీ;- అయ్యో డబ్బుకేం లెండి. నాతమ్ముడు నాకుదక్కితేచాలు,

శ:- శాస్త్రీ నాలుగైదు వందలైనా కావాల్సివుంటుందా.

శా:- ఆ. ఆమాత్రమయినా లేకుండా వెళ్ళితే అక్కడ మన కెవ్వరు దిక్కు. ఎన్నాళ్ళుండాల్సొస్తుందో ఎంత కథ వుందో.

శ్రీ;- డబ్బు విషయంలో కలత పెట్టుకోకండి. మీకు కావాల్సిన డబ్బు యీ పూటనే మీ మఠానికి పంపించి వేస్తాను.

శ;- చిత్తం మీడబ్బుముట్టడమే తడవు ప్రయాణానికి సిద్ధంగా వుంటాము. (అంతా వెళ్ళుదురు.)

ద్వితీయాంకం సమాప్తం.

# కల్యాణి

★

## తృతీయాంకము

(ప్రథమరంగం)

(మద్రాసులో ఒకయింటియందు బల్లపై టీ కప్పులు పెట్టియుండును. ప్రమోద్ నెక్‌టై కట్టుకొనుచుండును కల్యాణి టీ తెచ్చి బల్లపైపెట్టును మాధవుడు కూర్చుండి వేరొకబల్లపై వ్రాయుచుండగా తెర లేచును)

ప్ర;- కల్యా , పాఠం చెప్పి త్వరగా ఆఫీసు కెళ్ళాలి పుస్తకం తెరు.

క:- (పుస్తకం విప్పి) యీ తెనుగుపాఠంలో సంస్కృత శ్లోకాలెందు కండీ.

ప్రి:- ఆఁ సమయానుకూలంగా సంస్కృతం కూడ వుదహరణ రూపం గా వస్తుంది. ఫర్వాలేదు. చదువు.

క:- 'ప్రియా ముఖం కింపురుషశ్చ చుంబ' అంటే ఏమిటండీ.

ప్ర:- అనగా ప్రియురాలిని ఎవడో చుంబనం చేశాడట(నవ్వు)

క:- అబ్బా తేలిక మాటలలో చెప్పరుగద. నవ్వటమేగాని

ప్రి:. నా మొహం నీ మొహం ఇంకా ఎలా చెప్పేది. విను నీలాటిపిల్లను నాలాటి వాడు యిలా (ముద్దుపెట్టుకొనబోవ)

క:- (చేయి అడ్డంపెట్టి)అబ్బే బలే గురువుగారు దొరికారు. నాఅదృష్టం కొద్దీ వేళాపాళా ఏమీఅక్కర లేదు. సరసాలకు (చిరునవ్వు)

ప్రి:- నా దేం తప్పు శిష్యురాలర్థం చేసుకో లేనప్పుడు గ్రాహ్యామయ్యే టట్లు చేసిచూపించిన వాడేగురుడు. దీన్నే డైరక్టుమెథడంటారు

క:- అవును వడతులకు పాఠాలు చెప్పుతుంటే మీకు ఫీజు కూడా అక్కర లేనట్టుందే.

వి;- అప్పను చెప్పే నాల్గుముక్కలు సరీఘా టంకం పాడిలాగ ఆతుక్కు పోవాలి. తీజిచ్చినా వకటే మెచ్చినా వకటే జన్మంత తలచుకొంటారు.

క;- ఓ దేవుడా అలాగైతే నాకీలాంటి చదువొద్దు.

ప్ర;- నీవు జెప్పుతున్నా నాకు (Time) లేదు త్వరగా టీ యివ్వు.

క;- (టీ కల్పు చుండును.)

ప్ర;- ఏం రాస్తున్నావోయి మాధవ్ బడికి వేళకాలా.

మా;- ఇండియా మేప్ వ్రాస్తున్నానండీ.

ప్ర;- ఏదీ చూపు. (దగ్గరకు పోయి చూచుచుండగా కల్యాణి వచ్చును)

ప్ర;- ఇందులో మన యిల్లెక్కడవుందో చూపు.

మా;- ఇదిగో (అందరు నవ్వుదురు.)

క;- (అమాయకంగా) లండనెక్కడుందో చూపు.

ప్ర,- (నవ్వును)

క;- (సిగ్గుతో తలవాల్చును)

ప్ర;- కోపమొచ్చిందా ఏంటి కొంవదీసి. (మీద చేయి వేయును)

క;- (చేయితీసి) ఇక మీ తెరువు రాకూడదు. నేనేదన్నా నవ్వే.

ప్ర;- అంటే నీకు మనిషికి వచ్చినంత కోపం వస్తుందిగాని ఇండియాలో లండ నెలా వుంటుంది.

క;- ఎక్కడ తగలడ్డుందో నాకేం తెలుసు.

ప్ర;- తెలియకుంటే తెల్సుకోవాలి.

క;- మీరు తెల్పితేగా నవ్వడమే కాని.

ప్ర;- అయితే అదీ నా తప్పేనా.

క-: ఒక తప్పేమిటి తప్పన్నరకూడ కాబట్టి మా ధర్మశాస్త్ర ప్రకారంగా యీ తప్పుకింద యీ వేడి వేడి కప్పు టీ త్రాగాలి (అసి కూర్చోబెట్టి టీ ఇచ్చును)

ప్ర:- (కొద్దిగా చప్పరించి) షుగర్ ఎక్కువేశావు కాబట్టి మా లా ప్రకారం నీ కొక కప్పు శిక్ష. (మరి ఒక కప్పు కల్యాణికిచ్చును)

మా:- భేష్ మా మేష్టారు యిలాటి శిక్షలువేస్తే చెప్పినట్లల్లా వినే వాళ్ళం. (ఎగురుతూ పాట.)

పాట—వే వేడి కప్పు టీ త్రాగండి మీకు శిక్ష యిదే
పారమంత వప్పజెప్పి పరుగు తీసి వచ్చెదను
బీచి కెళ్ళనలేక మీకు బీ రెడీ.
(పుస్తకములతో వెళ్ళును.)

ప్ర:- మాధవుడు బలే చలాకీ కుర్రాడు. పెళ్లాం చెప్పులకు పిడకలు కట్టేరకం.

కల్యా:-అవును మీరు నాకు కట్టినట్టుగా (నవ్వు)

ప్ర:- (లేచి) యిక నేవెళ్తా. ఆఫీసు వేళయింది.

కల్యా -(విచారంతో) మీరు వెళ కానంటే ఈరోజున నేదో భయంగా వుందే.

ప్ర;- వెర్రిదానా ఎందుకీభయం, వంటచేసి పాఠం వల్లేస్తూ కూర్చో. త్వరగా నేపనితీర్చుకు వస్తా (వెళ్ళును)

కల్యా:-(దీనంగా) నా దిగులుకు కారణ మేముండొచ్చు

గీ॥ నామనంబేల? అశ్వాసానంబు సేయు
కారణము లేక కార్యంబు కలుగ గలదె?
అస్మదీయాప్తులకు నెట్టి అప్రియంబొ!
కాక నాకరిష్టంబేమి కలుగునొక్కొ!

ఎట్లయితే నేం, నేనేమి చేయగలను. ఆ దేవుని దయవల్ల మా ఆనందానికి ఆటంకంరాకుంటేసరి

డ్రైవర్:- (ప్రవేశం) ఎవ్వరు ఇంట్లో వుండింది, అమ్మాళ్
కల్యా:- యేం, ఎవరు బాబూ
డ్రై:- మీ పేరుదా కల్యాణి అమ్మాళ్
కల్యా:- అవును ఎందుకు
డ్రై;- (ప్రక్కకు చూచి) రండీ సార్, ఇదే వుండింది
శర్మ;- [ప్రవేశం] అమ్మా తొందరగా రండి, కారు తీసుకొచ్చాం
కల్యా;-[ఆదుర్దాతో] ఎందుకు బాబూ
శర్మ;- ఏం చెప్పేది తల్లీ. ప్రమోద్ కుమారుడు మా ఆఫీసు ముందు ట్రాం దిగబోయి పడిపోయాడు.
కల్యా;-ఆఁ అయితే ఏమైంది త్వరగా జెప్పండి
శర్మ;- భయంలేదులెండి, పడగానే ట్రాం కాలుమీదగా పోయింది. కాలువిరిగిందన్నాడు డాక్టర్
కల్యా;-అయ్యో, దైవమా యింక నే నేంజేయను
శర్మ;- వినండి తొందరపడకండి. ఆయన్ని హాస్పిటాలులో వుంచారు మీకై కలవరపడుతున్నారట మా పెద్ద యజమానిగారు కారిచ్చి మిమ్ము తొందరగా తీసుకురావలసినదిగా చెప్పారు.
కల్యా;-అయ్యో, అయితే పదండి బాబూ, (అంతా వెళ్ళును)

[స్వామి చలపతి వేషంతో సూటుకేసుతో ప్రవేశం]

చదివితి నన్ని శాస్త్రములఁ జక్కని చుక్కల కేళి దేలితిన్
బొదలితి నన్ని భాషలను పొందితి పెద్దల సాహచర్యమున్
వదలితి పూర్వమార్యముల వైనభవాని పదాబ్జ సేవకై
కదలితి మేదినీప్రళయ కారణ కంకణ బద్ధహస్తుడై

[నవ్వి] మన సంకల్పాలన్నీ O. K. మన politic సాగనిరోజు ప్రపంచ ప్రళయం. మనకొక్క కన్నే తక్కువగాని, అదే

వుంటే యీ పాటికి నిటలాక్షునంతవానికి నిలువనీడ లేకుండా చేసేవాడిని, (వ్యంగ్యంగా) Allright బ్రతుకనీపాపం అతనూ నాలాటి సన్యాసేగా [ఆగి] విశ్వవ్యాప్తమైన మనసత్తాను బజాయించాల్సిన పనేమీ లేదు. తెలియదన్న మొగాడెవడన్నా వున్నాడంటే ప్రాక్టికల్ గా మన అస్త్రాన్ని ప్రయోగించి మరామత్ చేస్తాం, (ఏదో కాగితంపై వ్రాసి) బల్లపైపెట్టి ధ్వని వినుట నభినయించి) ఏదో (Human creature) వల్లాయిస్తు న్నట్లుగా వుంది. ప్రక్క కొదిగి చూదాం తమాషా (చాటుకు పోవును)

ప్ర:- (ప్రవేశం) కల్యాణీ (3 సార్లుపిలచి) సరిపల్కకుంటే కనీసం కుల్కనైనా కుల్కు కళుకు తళుకు మనే తమాషా అయిన వస్తువుకటిస్తా. (జేబులోనుంచి హారంతీయును) ఆఁ యిదేమి చప్పుడే లేదే. (అటుచూచి) ఆఁ వంటకూడ చేయలేదే ఎక్క డికి వెళ్ళివుంటుంది. (ఆగి) యిదేమి నాకేమో ఆందోళనగా వుంది. ఎక్కడికి వెళ్ళేది కాదు. ప్రక్కయింటికేమైనా వెళ్ళిం దేమో (ప్రక్కకుచూచి) చలపతిగారూ మావాళ్ళెక్కడి కెళ్ళారో మీ కేమైనా తెల్సునా.

చల:- (ప్రవేశించి) ఏమోసార్ ఆఁ నేను బజారునుంచి వచ్చేసరికి మాత్రం ఆమె బ్రదర్ తోకూడ ఒక కారులో కూర్చునివుంది రెప్పపాటులో కారు కదలి మాయమైంది.

ప్ర:- (ఆశ్చర్యం) కారా ఎక్కడికారు.

చ:- ఎక్కడిదో నాకు తెలియదండీ సర్ ( m a new Commer)

ప్ర:- కారులో యింకెవరైనా వున్నారా.

చ:- ( Yes ) ఒక డ్రైవరు ఒక జంటిల్ మన్ కూడా వున్నాను.

ప్ర:- ఎవరో ఎక్కడికో మీరు విచారించారా.

చ-: ( No Sir ) మీ వారితోనే నే నెన్నడు మాట్లాడలేను. అం దుకతోడు ఆ పెద్దమనిషి రోజూ వచ్చేవాడేనై.

ప్ర;- ఆ రోజూ వచ్చేవాడే

చ:- (Yes Sir) నేను వచ్చిన నెలరోజులనుండి వస్తూపోతూ వున్నాడు.

ప్ర:- ఏ (Time) లో

చ;- మీరు ఆఫీసుకు వెళ్ళేసమయాల్లోనే అనుకుంటాను.

ప్ర;- నే నింట్లోవుండగా ఎన్నడైనా వచ్చాడా.

చ:- ఏమో సార్ నే నెప్పుడూ గమనించలేదు.

ప్ర;- ఎప్పుడూ నాతో అన్నారుకారే.

చ;- నాకేం అవసరం సార్. మీ Friend డో relation నో అనుకున్నాను ... అయితే ఎవరైయుండవచ్చు అమాయ-మూరి.

ప్ర;- (విసుగ్గా) నాకేమీ తెలియదు.

చ;- హరిహరీ పట్టి బూటక ప్రపంచం ఛీ.

ప్ర;- ఛీ అంతా మోసం,

చ;- ఆడదాని బుద్ధిమంచిది కావాలిగాని ... ...

ప్ర:- (తీక్షణంగా) ఉన్. (చలపతి కన్నుగీటుచు వెళ్ళును) (యోజించి) (Never) అలాటి దెన్నటికీ జరుగదు. నా కల్యాణి నాకై ప్రాణాలైనా సమర్పించేటంతటి సుగుణశీల. ఎప్పుడైనా ఏవిషయంలో నైనా ఆవిడ సీలంలో నా కాసంతైనా నలుసు కనపడలేదు... నేను నమ్మను. అంతా మోసం అల్లెన్నటికి కాదు కానేరదు. [నవ్వుతూ] నాకేమీ పాలుబోవటంలేదే. [బల్లమీది కాగితంచూచి తీసి వణుకుతున్న చేతులతో చదువును.]

"అయ్యా, మీతో లేచిరాకముందే నేనొక వ్యక్తిని ప్రేమించాను, కాని నా దురదృష్టంవశాత్తువారి దర్శనం మళ్ళీ కానందున గత్యంతరం లేక మీతో లేచి వచ్చాను. నా అదృష్టవశాత్తు తిరిగి నా ప్రేమమూర్తి దర్శనభాగ్యం లభించుటచేత వారి ఆజ్ఞానుసారం

వారి ననుసరింపక తప్పిందిగాదు. మీరు నవనాగరికులు కాబట్టి వేరే విధంగా భావించి విచారపడరనే ఆసిస్తున్నాను.''

ఇట్లు, కల్యాణి

(వణుకుతూ కాగితం చించి నేలకుకొట్టి) ప్రేమమూర్తట... దర్శనభాగ్యమట... తెలివిహీనుణ్ణి... ప్రథమంలో నమ్మలేక పోయాను. (క్రోధంతో) ఛండాలిని, రాక్షసి, నన్నునమ్మించి సర్వనాశనం చేసింది. దాన్ని నిలువునా కాల్చివేసినా పాపం లేదు. ఓ మాయలాడీ, ఛీ! పవిత్రమైన నా హృదయాన్ని భగ్నపరచావు. నన్ను ప్రపంచానికి ముఖం చూపకుండా చేశావు.

సీ॥ ఆత్మసాక్షిగ నాదు అర్ధాంగివనినమ్మి
అవమాన జలధిలో నదరిపడితి
ప్రణయ జీవితమునే ప్రత్యగ్రమనియెంచి
లోకంబువకు గాములోభినైతి
ప్రాణప్రదంబుగాఁ భావించినట్టి నా
అగ్రజు కోపాగ్ని నణయనైతి
గౌనములు లెక్కించి, కులమును కడద్రోసి
సంఘనూరుండనై సమసిపోతి

గీ॥ ఇనుపగజ్జెలతల్లికి ఈర్ష్యతోలఁగ
నాదు ప్రేమైక తంత్రీ నినాదమణఁగ
అండవిస్రంభ న్యాయంబు ననుకరించి
కాళ్లు కన్నులు లేని బికారినైతి.

(దుఃఖంతో) ఆహా, తానొకటి తలంచిన దైవమొకటి తలచు ననుట వాస్తవం. ఇంక నేను దేనికై బ్రతికేది. యీ మాయ ప్రపంచంలో, అంతావట్టి ఇంద్రజాలం... (నవ్వు) నేను బ్రతికివున్నాననే మీ భావం. కాదుకాదు. నా హృదయమేది. నన్ను జూచి జాలి

పడుతున్నారా. పాపం మీరంతా పిచ్చివాళ్లే. తాడునుజూచి పాముని భ్రమిస్తున్నారు. ఎండమావులనుజూచి నీళ్ళని చెడిపోతున్నారు. [వెర్రిగా] నన్నుజూచి వెక్కిరిస్తున్నారా, నన్ను వేధించారంటే అందరిని హతమారుస్తాను. నేనెక్కడ పోతే మీకేం ఎవడబ్బసొమ్ము నాది తిన్నానా, నాయిష్టం [కండ్లుమూసి తెరచి, చేతులతో] దేవత నీవేశరణు ఎందరినిమూరితే యేంప్రయోజనం ఇదంతా నాఖర్మ నాకెట్లయినా విచారంలేదు. నేను ఏకాకిని నాకు ప్రపంచమే లేదు. నీవే నా సర్వస్వం.

మ॥ చచ్చిన మానవుల్ నినుఁ బ్రసన్నుగ జేసికొనంగలారె! నా
అచ్చపు గాలిమేడలకు నగ్గిని బెట్టిన ప్రేమమూర్తి! యీ
కృచ్ఛపు దేహముండు వరకిమ్మహి నిన్ను ధృతింభజించి, యీ
పిచ్చి ప్రపంచమందుఁగల పీడలు ద్రాలని చోటి కేగెదన్.

(ప్రమోద్ వెళ్ళును, చలపతి ప్రవేశించును)

Certainly నా వ్యూహాలు తెలిసిన అభిమన్యుడు కాస్తా అంతరించాడు. కొంతైనా తెల్సుకునే వాళ్లుంటేనేతప్ప మంకు గౌరవం వుండదు. (పచారుచేస్తూ) పాపం ప్రమోదుడు మన గుగ్గిలంపాగకు గిజబిజై తనలో తాను తందనాలాడి చచ్చుపిచ్చిరామన్నై పోయాడు. లక్షణాల్చూస్తే ఇంటికి వెళ్లేరకంగా లేదు. మనకేం మనపూచీఅయితే తీరింది. (విని) మళ్ళీవదో పచిపీనుగ ఫిరాయిస్తున్నట్టుగా వుంది) (gess) (మాధవుడు ప్రవేశం) అక్కా అక్కా, ఈవేళ మా పంతులుగారు. స్కూలుకురాలేదు. అందుకేవచ్చాను. త్వరగా బీచికి వెళుదాం. (పుస్తకాలు బల్లమీదపెట్టి) అమ్మ దొంగటక్కుచేస్తున్నావు. మాటాడవు. (వెదికి) ఆఁ అక్కలేదే ఏక్కడికి వెళ్ళేదికాదు (ప్రక్కకుజూచి) చలపతిగారూ మా అక్కలేదే?

(చలపతి ప్రవేశించి) ఏమిటబ్బాయి

మాధ:- మాఅక్క ఎటువెళ్లిందో మీరు చూచారాబాబూ?

చల;- ఇంకెక్కడక్క. ఇంకోవుషారైనబావలో వుడాయించింది.

మాధ;-ఇంకో బావెవరు?

చల;-నీబావనీకుతెలుసు నాకేంతెలుసునోయి నాగన్నా

మాధ;-అయితే ఎవ్వడొస్తుంది

చల;-ఇంకేంవస్తుంది. కంటికి నీళ్లురావల్సిందే.

మాధ;-(యేడుస్తూ) ఆc నన్ను వదలేసి వెళ్లిందా

చల:-నీవెందుకు చంకలోపిల్లాలె

మాధ:-మరి మాబావో

చల:- ఎక్కడిబావ, అతనువచ్చి అంతా తెలుసుకుని అల్లావాలా అయి అడివిపట్టాడు.

మాధ;-ఎందుకు ?

చల:- పిచ్చిపుల్లాయి ఎందుకేంటి. ఎత్తుకు తింటానికి పైగా యింట్లో సామానంతా నాకిచ్చిపోయాడు

మాధ.-నా బంతులుకూడనా?

చల:-అన్నీ ఇచ్చాడు ఇంకా నీవాట్టేవాగకు కాలికిబుద్ధిచెప్పు

మాధ:-అయ్యో! ఇప్పుడేంచేసేది నాకెవరుదిక్కు, ఆకలేస్తుంది అన్నమెవరు పెడ్తారు. [ఆగి] మా అక్క నన్ను వదలి ఒక్క గడియైనా వుండేదికాదు. ఇందేదో మోసం జరిగింది. ఓ·దేవుడా నా అక్కలేకుండా నేనెలా బ్రతికేది. నాకేం తోచటంలేదు అక్కా అక్కా నీవెక్కడున్నావు. నన్ను మరచిపోయావా? [కూలబడి]

గీ॥ అమ్మ నాన్నను విడనాడి, అక్కపైన
అన్నియాసలు నిలపిన నన్నువిడచి
ఎటులcబోగల్గెనోc తోచదేమిసేతు!
జెట్టుపైనెక్క చేతులు పట్టువదలె.

చ:- ఏవచ్చావురలె యిది నీ అబ్బగారిల్లనుకున్నావా. వద లేకుంటే పింగాణి కూత మోయిస్తాను. పింజారీ వెధవ (మాధవును

గొంటును) నేటి కారుమాసాలనుండి మాయ బ్రహ్మయ గాండ్లతో వెదకించి యీ పిచ్చి బాపని పత్తాతీసేవరకు నా తల ప్రాణం తోకలో దూరింది. ఎలా గైతేనేం తుదకీ నాటికి యీ నాటకం జయప్రదంగా సాగించాను. యీ పాటికి మా వాళ్ళు కల్యాణిని రహస్యస్థానంలో భరతం పట్టిస్తూవుంటారు. ఇక మా మఠానికెళ్ళి పడుచువాళ్ళకు పిల్లలను ముసిలివాళ్ళకు కపాలమోక్షాలిప్పిస్తాను. (వెళ్ళును)

(మొదటి రంగం సమాప్తం)

---

తృతీయాంకము — రెండవ రంగం

(డాక్టర్ యిల్లు మంచంపై కల్యాణి)

పాట:— "బీనా" అను పాట మాదిరి

నాథా! సుగుణ సుందరా, శరధీ
ఖ్యాతమతీ పరిభూత హృదయుపై
ఏతలమేగితో, ఎంతవగచితో
ప్రాణ మాన సుమ పల్లవములనీ
పాదార్చన జేసెద, రాజా? ... ... నాథా ...

(దుఃఖంతో అవును నిజంగానే, నీచురాలినే. పవిత్రమైన తన హృదయాన్ని నా కప్పగించిన పతిని, నాకై తలిదండ్రుల్ని కూడ వదలిన నా ముద్దు తమ్ముణ్ణి యెడబాసిన నాకంటె నిర్భాగ్యు రాలు మరెవరుంటారు. (ఆగి) దయామయులగు డాక్టర్‌గారే సమయానికివచ్చి ఆ దుర్మార్గుల బారినుండి తప్పించకుండా వుంటే నా గతేమయ్యేదో. యిలాటి దుండగీళ్ళవల్ల నాబోటి అమాయక స్త్రీలెంతమంది అవమానానికి గురి అవుతున్నారో ఆ దేవుడే ఎరుగు... యింటికా తాళం నా భర్త నన్నేమనుకున్నాడో ఎటుబోయెనో తల చిన కొద్దీ గుండె లదరిపడుతున్నాయి ... అంత రాత్రివేళ మేమొచ్చే వరకు యింటికి తాళం వకుంది దానివల్ల మావారు వూళ్లో లేనట్టుగా తోస్తుంది. ఆ తుంటరులు వారి నెటు అగం చేశారో నా విధీ నాకేం దారి.

సీ॥ కులమును కడ ద్రోసి, తలమును విడనాడి
కాముకియను పేరఁ గ్రాలఁబడితి
ప్రణయానురాగంబుఁ బావసంబని యెంచి
కాలసర్పంబుచే గరవఁబడితి .
నాదు ముద్దులమూట, నామాధవుని తల్లి
తండ్రులకెడపిన దానవైతి
ప్రాణప్రదంబుగాఁ భావించినట్టి నా
ప్రభు రాగదృష్టిలోఁ బతితనైతి

గీ॥ అతులఁభక్తిని నానాధునాశ్రయించు
తల్లిచాటు నాతమ్ముని దారసిల్లు
భాగ్యమేకల్గకున్న నేబ్రతికి ఫలమె!
పతులఁబాసిన సతులకుఁ గతులుఁగలవె !

నా భర్తజాడలో వెళ్లిన డాక్టరుగా రింతవరకు రానందున మరీ నామనస్సు తత్తరపడుచున్నది.

(డాక్టర్ ప్రవేసించును)

ఉ॥ ధర్మవతివ్రతాత్ములగు తల్లులఁ సత్యగభీర సంపదల్
నిర్మల దుగ్ధధారలను, నింపి ప్రియంబున, సుగ్గుపోసి, స
త్కర్మల ఢోలలందునిచి, కాచిన భారతి కన్నులూరవే!
నర్మముగా సతీత్వమును నాశముచేసెడివారి జూడఁగన్.

(కల్యాణిని సమీపించి) అమ్మాయీ ఎవరో చలపతిరావు గారట మీయింటి ప్రక్కన వుండేవారట కలిశారు సంగతివిచారించాను.

కల్యా:-(ఆదుర్దాతో) మావారేమైవెళ్లారట

డాక్ట:-నీ శీలంపై సందేహంకలిగి ఎంతచెప్పినా వినకుండా యిక్కడ వుండనని రైలుకు వెళ్లిపోయాడట మీ అబ్బాయికూడ ఏడ్చి ఏడ్చి ఎటోపోయాడట.

కల్యా:-(ఏడుస్తూ) ఆఁ ఇంక నేనెవరికోసం బ్రతికేది. నేనెళ్తా. మా వారిని వెతుకుతూ వెళతా. (వెర్రిగా) లేకుంటే ఎవరూ కనబడనిచోటికెళతా. సుఖము లేని స్థలానికెళతా. (వెళ్లబోవ) (డాక్టర్ అడ్డగించును) నన్నడ్డగించకండి. అదిగో నా ప్రమోద్ పిచ్చివాడైపోతూవున్నాడు. నన్ను నిందిస్తున్నాడు, నాముఖం చూడనంటున్నాడు. క్షమించమని కాళ్లుపట్టుకుంటాను. నన్ను వెళ్ళనివ్వండి... అయ్యో నా తమ్ముడు అన్నం లేక ఆయాస పడుతున్నాడు. చినిగిన గుడ్డలతో బజారులో పడ్డాడే. మాధవా! నేనుచూడలేను. (కండ్లుచేతులతో మూసుకొని పరుగెత్త బోగా డాక్టరడ్డగించగా ఆయనచేతుల పై వ్రాలి స్పృహతప్పును)

డా:- కల్యాణీ... (తలనిమురుతూ)

కల్యా;-ఊఁ

డా:- నీవేమీ విచారపడకు. మీవాళ్ళతో నిన్ను కలిపేభారం నాది, ఇటుచూడు అమ్మాయి.

కల్యా:-(కన్నులు తెరచి) ఆఁ నావాళ్ళతో నన్ను కలుపుతారా?

డా;- తప్పక కలుపుతాను. ఏడ్వకు ధైర్యం తెచ్చుకో

కల్యా;-(ఏడుస్తూ) ఆమోసగాళ్లు మావారికేమైనా అపాయం కలిగించారేమో.

డా:- never అదెన్నటికీ జరుగదు. ఒకవేళ మీ అబ్బాయి మీవారికి కలియకుంటే ఆగమైపోతాడేమో చెప్పలేను

కల్యా;-ఇక నాతమ్ముని యాస వదలుకోవల్సిందేనా బాబూ

డా:- నీతమ్ముడుకూడ తప్పక దొరుకుతాడు

కల్యా:- ఎలాదొరకగలడు

డా:- చిన్నపిల్లవాడు ఎటువెళ్ళగలడు, ఈ పట్నంలోనే యెక్కడైనా వుండితీరాలి. వెదకిస్తాను.

కల్యా:-అలాగైతే మనమే స్వయముగా వెళ్ళి వెదుకుదాము

డా;- మంచిది నీభర్త స్వగ్రామం

కల్యా;-రాజాపురం జమీందార్లు

డా;- అక్కడ ఆయనకెవరున్నారు?

కల్యా;-అన్న వదినగారుతప్ప మరెవరూ లేరు మొన్ననే అన్నగారికి
జబ్బుగావుందని కలువరిస్తున్నాడని టెలిగ్రాంవచ్చింది.

డా;- అట్లయితే తప్పక అక్కడికే వెళ్ళివుంటాడు

కల్యా;-అక్కడకే వెళ్ళివుంటారా బాబూ

డా,- అవును, తప్పక నీకెందుకీ అనుమానం యీ రోజే టెలిగ్రాం
ఇచ్చి కనుక్కుంటాను

కల్యా;-అయ్యా, నేనెక్కడికో వెళ్ళానని నన్ననుమానించా రేమో?

డా;- అలాంటిదిగులేమీ పడకు, నేనన్నిటికి సమాధానపరచి చక్క
బరుస్తా, అతనుమాత్రం అంత మూర్ఖుడు కాడనుకుంటాను

కల్యా;-(దుఃఖంతో) నాకై ఎంత విలపించారో పాపం

డా:- యేడ్వకు తల్లీ, నేను స్వయముగావచ్చి నిన్నతనికి వప్పగిస్తా

కల్యా:- [తలవంచి] నేనక్కడకు రాజాలను

డా:- ఏం!

కల్యా:-(మూకీభావం)

డా:- చెప్పమ్మా, నీవు నా కూతురుతో సమానం శంకించకు

కల్యా:-వారి అన్నగారి ఇష్టంలేకుండా నన్ను...

డా;- అలాగైతే, మరీమంచిదే అంత ప్రేమగలవానిని యిక్కడికే
రప్పించే యేర్పాటుచేయగలను.

కల్యా:-శతవిధాల వారికెటికెళ్ళరనుకుంటాను బాబూ

డా;. తప్పక వెళ్తాడు. ఆపత్కాలములోనైనా అన్నగారిని చూడ
కుండా వుండ లేడు. అది సోదరప్రేమ

కల్యా;-నా కనుమానంగావుంది

డా;- సరి అక్కడలేకన్నా మరెక్కడైనా వుండకపోడు. అతను
దొరికిందాకా? నాప్రయత్నం మానను అంతవరకు నా ఇంట్లో
వుండు, నా పిల్లలతోపాటు నీకేలాంటి కష్టంకలుగదు.

గీ॥ సత్యపథమున మున్నాఁడు సంకటములు
వాని నెదిరింపఁ సద్యశక్తి ప్రాప్తికలుగు
నిహపరంబుల, సర్వదా హేయమైన
సద్యసుఖముల కాసించు జడుఁడు నరుఁడే?

కల్యా:- అయ్యో వారికీరోజేతంతినంపి నా మాధవుని వెదుకుతుంటే కొంత మనశ్శాంతి కలుగుతుందేమో.

డా;- మంచిది, వెళుదాంరా కారు సిద్ధంగావుంది

తృతీయాంకం — సమాప్తి



# కల్యాణి



## చతుర్థాంకము

### మొదటి రంగం

(భక్తులు కూర్చునియుందురు, స్వామి పురాణము చెప్పుచుండును)

విన్నారా బాలతపస్వియైన ఆ ప్రహ్లాదుని తండ్రియైన హిరణ్యకశిపుడు పలుబాముల పాలుచేసెను. కాని ఆపరమ భాగవతోత్తముడు వాని నన్నిటిని తృణప్రాయయగా నెంచెను. ఆభక్తవత్సలుడైన మహావిష్ణువు ఆయిక్కట్టుల నన్నింటిని సుఖప్రదముగా చేసెను. ఓ ప్రహ్లాద. నీవెంత ధన్యుడవోయి,

సీ॥ సంజకెంజాయలో జలకమాడినయట్టి
నాడిలోప్వె నుపలంపు టోలుపుజేసి
అజగరంబులె కోట్ల నంబరవీధిని
దారకాపళియట్లు దనరెమేను
అశీదంబు ప్రేటుల నలమదంశలు, గళం
బాలింగనము జేసినట్టులొదవె;
జ్వాలనుంచు నిసుగని జాఘువాప్రాంతల
నలది కర్పూరంపు టారతిచ్చె

గీ॥ అట్టి నిను గన్న కనులు నిండారు పెరిమ
దాన మొనరించె వేల్పుల తటినులందు
అట్టి సమయాన పుడమి నే బుట్టియున్న
దాపకీనోపచారినై తపిసియుందు.

(స్వామి తాత్పర్యం చెపుతూ భక్త్యావేశంతో మూర్ఛిల్లును)

శర్మ:- (మెల్లగా) భక్తులారా స్వామివారికి నమస్కరించి మీమీఇం డ్లకు వెళ్ళిపొండు. స్వామివారు భక్తిపరవశులైనారు. రేపింకా మీ స్నేహితులతో వచ్చి సాధ్యమైనంత ఎక్కువ పూజా ద్రవ్యాలు కానుకలు, తెచ్చి స్వామివారిని పూజించి తరిం చండి. (సైగచేయును) మహాత్మా, తమ అంతరంగిక భక్తు లంతా మీ భక్త్యావేశానికి హడలెత్తి పరుగెత్తారు ఇక శాం తించి నేత్రాలు తెరవండి.

స్వామి:-(కన్నులు తెరచి) వత్సా భక్తియొక్క వై సుషుప్తి క్రింద మారి సారామహాసముద్రంలో సాగిపోయాను.

శా:- భలేవుల్లాఫిలిం చూపించారు మహానుభావా.

శర్మ:- ఈ దెబ్బతో మనరొట్టె నేతిలో నేయి రొట్టెలో వులట్‌పలట్ అయినట్టే.

స్వా:-Yes మరేమనుకున్నారోయ్. రేపీ పాటికి వూరంతా వూడి పడుతుంది మా పాదపద్మాలపై

శర్మ:- అప్పుడు కృష్ణాతరంగిణి మన కంఠస్నానాలలోకి కదలిపారుతుం దన్నమాట.

స్వా:- వహ్వా To the point గా మాట్లాడావోయి

శా:- పట్టుమని పడదీసి పద్రాడాములు ఘస్టురకం వైను పడబోసినా తక్కువే ఆతసినోట్లో.

స్వా:- ఏదీ శాస్త్రీ యిదేమాటపై పుత్తునదలే మహాప్రావకం సుజా తాన్ని చూపించు, (శాస్త్రి గ్లాసులోపోసి యివ్వగా) పనుగలు తినేవానికి పీనుగలు ఘనమా అన్నట్లు ఇదేంటి. అబుద్ధికాస్తా ఇటుపడేసి త్వరగా మీరు వూళ్ళోకెళ్ళి మనకు రావలసిన కట్నాలు, కానుకలు వసూలుచేసుకునిరండి. వచ్చిన తర్వాత అమ్మగారి ఆరాధనలో ఆనందించొచ్చుగాని (శిష్యులు వెళ్లుదురు)

(కాంతం ప్రవేశం)

స్వా:- Hollow దయచేయండి దేవిగారు. దాసుడు సేవించడానికి సిద్ధంగా వున్నాడు Just ఇప్పుడే dress మార్చుచు వస్తా,

విరహతాపం కలిగిస్తున్నందుకు క్షమించండి (goes)

కాం:- (స్వగతం)

ఉ॥ నాయన భోగమేమనదు, నాదు విభుండు, దయాక్షమాత్ర సం
స్థేయుఁడు, సంపదల్ విరిసె, సిగ్గులు దవ్వులఁబారె, నకామహా
ప్యాయముజేయునామఱఁది, యాధృతినెంతయుజూపి, మన్మనో
నాయకుఁడైన మామయునిరక్ దనుపుక్ సుమసాయకంబులక్.

ఏంచేసేది. నేనాచిన్నదాన్ని మావాళ్లో ముడోపెళ్లి వృద్ధ జంబుకానికి మెడగట్టారు. డబ్బాశకి. ఏదెట్టున్నావాటికి మీసాల బిరుసుజూస్తి. పట్టి అనుమానప్పేనుగ. ఏంజేస్తాను. నాలో నేను కృశించిపోయాను. ఇంతలో దేవుడు పంపిన దేవదూతలాగా మాగురు దేవుడూడిపడడం జరిగింది. అమ్మలక్కలంతా నామీద ఏదోగాలి, దూలివుందని, ఆయనగారు తీర్థంయిస్తేనే సంతానం కల్గుతుందని బల వంతపర్చారు. దానికి మావారుకూడ ఒప్పుకొని ఆజ్ఞయిచ్చారు. నేను వరుసగా ఒకవారంరోజులు వెళ్లేసరికి గురువుగారు గ్రహమై పట్టారు. వీడమ్మకడుపు చల్లగుండ మొత్తంమీద అసాధ్యంప్పిండం. ఇప్పటికి సంవత్సరమైనా గుట్టు బయటపడకుండా అన్నిపనులు నెరవేరుస్తున్నా డు. ఎల్లాగో కొంతైనా ఆనందిస్తున్నాను. ఇందుకు నా తప్పేముంది.

గీ॥ వృద్ధజంబుకములు, తమవేడ్కకొరకు
యౌవనాంగనలను బెండ్లియాడుచుంట;
కులటలను సేయుటేతప్ప ఫలముకలదె?
గద్దికావలి సునకంబు కాచినట్లు.

(యోచించి) యింకనాన్నల్లో మాపని సాగేటట్టుగాలేదు. ఈ మధ్యమా ఆళ్వార్లేమో. అదోదృష్టిలో చూస్తున్నారు. పైగా మా. రిదొకడు ఇక్కడనే ఠికానా బైటాయించాడు. అయి తేం అతనొకపిచ్చివాడు.

స్వా:- (ప్రవేశించి) ఏమన్న సమాచారం. ప్రణయభాషణాలా ప్రళయ ఘోషణాలా.

కాం:- ఏవైనా హృదయతోషణాలు. నేను త్వరగా వెళ్ళాలిరా

స్వా:- అంతమాత్రాని కెందుకొచ్చావు. ఈగోడదాడలో

కాం:- నీ ఏడుపూ నీవూ పరాధీనంగావుండి పరులనోట్లోపడడం దేనికి ఆలోచించిచెప్పు.

స్వా:- అపరాధీనం వదలించుకోడంలో నేవుంది పరమార్థం.

కాం:- ఈ కళేబరం కాట్లోకి వెళ్ళినరోజునగాని లభించదా పరమార్థం

స్వా:- పొరపడుతున్నావు. అసాధ్యమనే ముక్కను నాహయాములో నాల్కమీదకు రానీయకు కబర్దార్.

కాం;- అయితే క్షమించండి అట్టె ఆవేశానికి రాకండి (నవ్వు)

స్వా:- నవ్వులుగాదు... ఇదిగో కాంతం ఇంకెన్నాళ్లీ మాయవేషాలు.

కాం;- జరిగినన్నాళ్లు జరుగనీయి. మరేం జేస్తాము ఎలా కావల్సిందో

స్వా:- పెత్రిబాగుల వెంకమ్మా ఆమూలాగ్రంగా ఆనందాన్ని అనుభుక్తం జేసుకునే అవకాశాలుండి కూడ యీ యలగందుల మరజీవనమేమిటి

కాం:- అంత సులభసాధ్యమైన మార్గముండగా ఇన్నాళ్ళనుంచి చెప్పవుకావేం.

స్వా:- ఇంకిట్లా అనుకున్నాని అంతరార్థం చెపుతా. నీకు నిజమైన అనురాగమే వుంటే సంపూర్ణ యావ్వన సౌఖ్యప్రాప్తమే వుంటే నిమిషాల్లో జేసేపని తెలిసిందా.

కాం:- అదేదో నన్ను చంపక సాయించండిస్వామీ మనస్సులో తళి హాత్తమెందుకు.

స్వా:- నారాణిగారిని విసికించినందుకి దేశిక్ష (త్రాగును)

కాం:- నాపాడశిక్ష. నీవుచెప్పవు నేను వినను. ఇకనే వెళ్తా. ఈ గుడు గుడు కుంచాలెందుకు (పోబోవును)

స్వా:- (పట్టుకొని) ఇదిగో చెప్తున్నా విను. ఇక ఒక్కరోజు కూడ నేను ఈవూళ్లో మైరావణ జపాలుచేస్తూ వుండలేను. కాబట్టి నీవు నావెంట రాగలవా లేవా, తేల్చి చెప్పు.

కాం:- అబ్బో, అలాజేస్తే. బ్రతుకుపైఆశలుంటాయా మనకు.

స్వా:- ఏం. ఎంతరి బ్రతుకుల ఆశవదిలితేనేగాని, నా బ్రతుకు ఆశవదల్దు

కాం:- ఎందుకంటే మావారు అన్నిట ఆరితేరినవారు. మనకు ముప్పు వాటిల్లకుండా యుండదు. అదిగాక ఆర్థికంగా ఇంత సుఖ పడనూ లేము.

స్వా:- ఓహో, యీ చొప్పకట్ట ప్రసంగాలన్నీ బట్టదాఖలు చెయ్య సమయం వచ్చినప్పుడు రాజులంతటివారినే రచ్చపెట్టాం.

కాం:- ఎలాగైనా కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు

స్వా:- సరి నీకాభయముంటే ఆర్థికంగా, ఆంతరంగికంగా లోటు లేకుండా ప్రణయ డోలికలలో వూగించే ఉత్తమ పథాన్ని ఎందుకు చూచుకోకూడదు.

కాం:- అలాగైతే ఇంక కావల్సిందేమి అదేదో త్వరగా ఊ౯

స్వా:- ఏమంత పెద్ద డొంకతిరుగుడు సమస్యగాదు. మిడతవలె ఎగ రక విను. మీవారి షష్టి కాస్తా వటపటా యిస్వాహా......

కాం:- (అదరిపడి) ఆ౯ ఆ౯ అదామార్గం. ఎంతైనా పావంగాదు

స్వా:-చ॥ బ్రతికిన నాల్గునాళ్లు భువి౯ బాపము గీపమటంచు దుర్వ్యథా తతిబడి, తాబికారి యవతారము౯దాల్చ్యెలె, నారకంబు, హృ ద్గత సుషమాభిలాషల౯ యథా యథలై చననీక, నెల్లొ సం గత మొనగూర్పు స్వర్గమగు౯ గాన రె! నాదు వసందుపోకడల్ (నవ్వి) అన్నను. సంసారంలో చేతగాని చవటలంతా పాప పుణ్యామంటూ కల్పించుకున్నారు. మనకుకాదు. రెండవది సమయం వచ్చినప్పుడు పురుషునికంటే స్త్రీయే సాహసవంతు రాలంటారు. కాని నీ గౌరవాన్నికూడ గుంటపెట్టి గంట వాయించావు.

కాం:- కాదుగాని, నాకేమో జంకుగావుందే

స్వా:- అబ్బా ఎంతసంగనాచివే. జంకేంజంకు అవ్వాకావాలి బువ్వా కావాలన్నవాళ్లు అన్నిటికీ సిద్ధపడాలి. లేకుంటే ముండాలై మూలను పండాలి అంతే జీవ బ్రహ్మైక్య సంవాదంలో వుండే రహస్యం.

కాం;- (విచారంగా) ఏవిధంగానైనా తెలుస్తే

స్వా:- నీవట్టి అమాయకప్పిండానివి ఆడాళ్ళలో పుట్టవలసినదానవు కావు. నాశక్తి సామర్థ్యాలు తెలిసినవాళ్లెంకెవరైనా యీ నాయనమ్మ మాటలాడారంటే నాల్కె చీల్చేవాణ్ణి.

కాం;- ఎవరూ కడతేర్చందీ కళ్లుమూశాడంటారా, మీమాటలుగాని

స్వా;- పరునికి నారాయణునకు తెలియకుండా కడతేర్చేభారం నాదని చెప్పడానికి నామర్దాగావుంది. ఏదో కారణం లేకుండా కార్యం జరుగదు కాబట్టి దాని భారం మోయడానికి పాపాలకు భైరవుడు నీ ముద్దులమరది తయారు.

కాం:- పాపం అతనేమన్నాడు. దేవునిలాంటివాడు

స్వా:- నీవు వట్టి మట్టి విగ్రహానివి. నాబుర్రలో మలామంతా నాకేస్తున్నావు. చెవులు నావేపు నిగడించి శ్రద్ధతో విను. చెప్తా. ఏమంటే పాపం అనేది మన పవిత్రాత్మకు పంకిలంలాంటిది. యీ మానవజంతువు తన మనస్సులోవుండే సంకిత మీడేర్చుకోలేక హృదయవేదన కల్గించుకోవడమే పాపం. మనస్సుకోరిన ప్రకృతి సౌభాగ్యాలన్నీ పొంది ఆనందించడమే పుణ్యం. తర్వాత మీ మఱది సాధువన్నావు. నిజం చావు దప్పి కన్నులొట్టబోయినప్పుడు అంతా సాధువులే. కానిమళ్లీ అనుకూలంగా గాలివిసిరిందా సాధువు యోగువౌతాడు. ఇప్పుడైనా శిఖరానికి చేరినవా నా శ్రీసూక్తులు

కాం;- ఏంజేస్తాడతను, నీ భ్రమేగాని

స్వా,- హరి హరి, రెడ్డొచ్చె మొదలెట్టమన్నట్టుంది నీ భోగట్టా. విను మీవారు పరమపదం సేకించకోగానే నీ పిచ్చిమరది లా ప్రకారం ఆస్తిపాస్తులన్నిటికి హక్కుదారుడౌతాడు. నీవూ,

"జోహుక్షం సత్కా"రనాల్సొస్తుంది. అందుకే అలనెప్పుడూ యీ ధోరణిలో ఘంటాడనకు

కాం:- (విచారంతో) ఇవ్వన్నీ తలపుకొస్తే తలకాయ తారామండ లాని కెగిరిపోతున్నదే. ఏంజేసేది.

స్వా:- (తలనిమిరి) నీకున్న భయం నాకేమీ లేదు. నీమీద ప్రాచిక పుల్లైనా పడకుండా నేను పని సాగిస్తాను. అంతకు కావలం టావా ఈరోజే ఈవ్రారినుంచి మాజండా నీకు తామ్ర నీయిష్టం.

కాం:- సరి. నా పంచప్రాణాలు మీ కర్పించాను. పాలనైనా ముంచండి. నీళ్ళనైనా ముంచండి... భారంమీది

స్వా:- (చేయిముద్దాడి) కోటివరహాలమాటన్నావు దక్షాఅంటేనీది

కాం:- (సంభ్రమముతో) ఇకథాక్రమమేంటి త్వరగా చెప్పు ఆలస్య మైంది, అనుమానిస్తారు.

స్వా:- ఆలస్యమెందుకు ఈ రాత్రే శుభస్య శీఘ్రమన్నారు పెద్దలు

కాం:- అబ్బా అంత తొందరెందుకు వీలుజూచిచెప్తాలే

స్వా:- మనకు వీలుగీలేంటి అర్థంలేనిమాట. ఎప్పుడు సంకల్పిస్తే అప్పుడు వీలుండితీరుతుంది. మాపంచాంగాల్లో అదిగాక ఆల స్యదమృతం విషం అన్నాడు మా సిద్ధాంతి. భయంలేదు. కాబట్టి నీవు మామూలుగా పడుకునేచోటనే వడకో ముసి లాణ్ణి నాగబలిపోలుతీసి తర్వాత నిన్ను లేపి కథనడిపిస్తా. జాగ్రత్తగా సంచరించుసుమా.

కాం:- సరి మంచిది; ఇకనే వెళ్తా

స్వా:- ఏది ఒక్కసారి (ముద్దు పెట్టుకొనబోవును, కాంతం చిరు నవ్వుతో వారించి వెళ్ళును)

హుఁ లోకానికి తెల్విలేటలనేమాట కన్వయం చేస్తూ చేస్తూ నాదుంప తెగిపోయింది. బ్రహ్మ బేధ్యమైన మన మంత్రా లన్నీ యీ మానవ మృగాలేమి తెలుసకోగలవు. మూల నున్న యీ ముసాలిక ముండను, ముగుడాడేసి ముందుదో

వకు లాగేసరికి, నాతాత ముత్తాతలంతా దాసోహమన్నారు ... కాని ఈసంగతి మా ఫకీర్లకు తెలిసిందంటె పడికట్టురాయి పడుతుంది ... అప్పను మా స్టైల్ ల్యాంపుల సహాయం కూడ అవసరం. కనుక అచ్చమ్మపెండ్లిలో బుచ్చమ్మ శోభనం అని చెప్పక టూకీగా కథాసంగ్రహం వ్రాయిస్తాను. గడచి గట్టెక్కిన తర్వాత మా టాటా డాఢా గాళ్ళను ఉత్తర దక్షిణ ధృవాలకు రవాణాజేశానంటే మనకీ బహుకృత వేషాల గ్రహం వదలి బృహస్పతి వదకొండింటికి పట్టాయిస్తాడు. ఆపైన కాంతంతో మనకబ్బే బండారం కాస్తా భగ్గుమనిపించి అవిడను అంతరిక్షానికర్పించి, మళయాళభగవతిని పూజించి మకోనుగువ మీద మంత్రాక్షతలు చల్లుదాం దీనికో జమాఖర్చా. ఇలాంటి వాళ్ళెంతమందికి చరమగీతాలు చదివాను.

తే॥గీ॥ కట్టులేకున్న గొల్లనిఁ గొట్టకటుము;
మెత్తగాఁబోవఁజూచిన మొత్తుచుండ్రు;
నేతిబీరల కాగాచి, నేస్తమిచట
ధర్మ పన్నాలకియ్యది తఱియుఁగాదు

(శర్మ, శాస్త్రి, సీసాలతో ప్రవేశం)

స్వా:- Hollow Thanks (సీసాలాక్కొని) అనుపానము లేసి ఔషధమేమిటోయి అబ్బాయిల్లారా.

శర్మ:- పంజేసేది సార్, మటన్ మార్కెట్టులో మందున్నారని మనం వెళ్ళడం బాగుండదని శాస్త్రి మారాంజేసి నన్ను లాక్కొచ్చాడు.

స్వా:- What Sastry అలాగైతే సురా మహాశక్తి సేవకు సుతలాం పనికిరావు. (త్రాగును)

శా:- అలాకాదు సార్ చేతుల్లో బాటిల్సు పట్టుకుని పైగా మార్కెట్టుకు వెళ్ళితే మన జంటిల్ మన్ లక్షణాలకు భంగమనుకున్నాను "ఎక్స్యూజ్ మి"

శర్మ:- సప్తకట్ల సరేనన్నా! ఇన్నాళ్ళనుండి మా ఆదర్శంలో ఈ చల్లని తల్లి సేవజేస్తున్నా కూడ ఆ దేవికుండే విశ్వవ్యాపక నిరతి తెల్సుకోలేకపోయాను. నీ అనాకానీబుర్రకెక్కే ముక్కాలి. చెప్తావిను.

సీ|| గాంధీ మహాదేవి నాందియయ్యెను నవ్య
నాగరికుల జగన్నాటకమున
బ్రాంది దేహీశ్వరన్ బడయుటచే ఘనుల్
నిబ్బరంబుగనుందురి క్లబ్బులందు
బ్రాందీదయన్ పెద్ద పాటకులేగాక
నటకావతంసులైనారు జగతి
బ్రాందీ ప్రసన్నత బడసిరి ప్లీడర్లు
గొప్పపేరును డబ్బు కోర్టులందు

గీ|| అన్నిరోగాలకిది పరమౌషధంబు
పిరికిపందల కియ్యది కఱకుకత్తి
బుద్ధి మాంద్యంబునకు యిది ప్రొద్దుపొడుపు
యీ మహాశ్లోకమునకిదే, ఇంటివేల్పు.

శాస్త్రి:- వహ్వా వహ్వా అందుకే తెల్లవాడు బ్రాందిచుక్క వేయకుండా బయటకాలెట్టడు.

స్వా:- నరేగాని ఇంకెన్నాళ్ళీ పాడుమఠ బ్రతుకీప్రాల్లో

శర్మ:- నాకూకూడ ఈ వెధవవిలేజిలో వుండటం విసుగ్గానేవుంది

శా:- అందుకనే సంసారులు తిరిగి చెడతారు మనబోటి సన్యాసులు తిరగక చెడతారన్నాడు పూర్వమో పెద్దమనిషి

స్వా:- That is right మనబోటి ఆత్మ సన్యాసులం చాలానాళ్లు ఒకచోటనే టికానావేశామంటే ఆకాస్త బండారం బయటపడుతుంది.

శర్మ:- అయితే ఎన్నడు గవాళంకడుదాం

స్వా:- ఎప్పుడైనా వెళ్ళచ్చు కాని మన భోగట్టా తెర్చి బేరీజుచేస్తే బేలెన్సు బండిగ్గిరంత సున్నయింది.

శా:- అయితే భత్యాలేమీ గిట్టకుండా ఎలా బయలుదేరటం.

స్వా:- అందుకే మనమొక మహత్తర కార్యం సాధించాల్సివుంది.

శర్మ:- What and how వుదహరించండి స్వామి

స్వా:- మనకావల్సింది పట్నవాసం;

శా.- Yes sir అంతకంటే కావల్సిందేముందీ పాడులోకంలో

స్వా:- ఈ రాత్రే ఎక్కడైనా పెద్దలాటుకొట్టామంటే బ్రతికి బయట పడ్తున్న మాటే.

శర్మ:- Very good కాని మంచెక్కా సుఖించకాలి.

శా:- ఔను ఈ రోజుల్లో జమీందారులతప్ప అన్యథా శరణంనాస్తి అన్నారు అర్ధశాస్త్రంలో

స్వా:- అంతే ఈ రాత్రే లూటీచేసి కొంత సర్దుకున్నతర్వాత ఇక్కడ నుంచి బిచాణావెత్తుదాం.

శర్మ:- సంగతి సందర్భాలన్నీ మీ కవగత మేగా

శా:- వారికి తెలియని ప్రపంచముందా

స్వా:- అదీమాట

శర్మ:- ఏమో మొత్తానికి కొడకుబెట్టుకున్నట్టు కాదుగదా?

శా:- (నవ్వుతూ) ఫర్వా లేదు పికబోయినా తోకైనా మిగలదా

స్వా.-(ముఖంచిట్లించి) ఏమిటా శాపహాస్యం! చదవేస్తే వున్నమతిపోతోంది మీ మొహాన్నున్న వంకరగీతలకు నేనేంచేస్తాను. ప్రారబ్ధం.

శర్మ:- క్షమించండిసార్. సరదాగా ఒకజోక్ విసిరామేతప్పమరేమీ కాదు

శా:- అంతే! ఇప్పుడు మీరు పుల్‌నోట్లోకి పోకపోన్నారేడీ

స్వా:- అదీదెబ్బ! ఆంజనేయులంత మాటన్నాప్రాయు

శర్మ:- మీరు Bench చేసిన అర్డరుకల్లా బద్దుల మవసమే మాకు బహాదురీ.

స్వా:- అయితే తగిన ప్రయత్నంలో వుందాం రండి.

మొదటిరంగం — సమాప్తి.



## చతుర్థాంకం—రెండవరంగం

(శ్రీవల్లభుని పడకగది- మంచంపైకూర్చుండును.)

ఆహా! ఏమిది. ఈ రోజు నామనస్సేమో డోలాందోళనంగా వుంటే. కారణమేముంటొచ్చు ... అన్నను నాబోటి నిర్భాగ్యుని మనస్సెలా ఆనందంగా ఉంటుంది.

సీ॥ బిడ్డలఁగనేను బిరుదైన వయసునఁ
కంట్లఁ జూడఁగ టనేమి ప్రియముఁదక్క-
పసినాడె తలిదండ్రిఁ బాసినతమ్ముని
పెంచినందులకేమి మంచిదక్క-!
అతుల సంపదలు నా యనుజన్మునకుగాను
కూర్చినందులకేమి కూర్మిదక్క-
వంశంబునకు నిల వరయశస్సంపదల్
గడియించినందుకే ఘనతదక్క-

గీ॥ సర్వవిషయముల నాశంబు సంతరించె
మొండికాల్పునే నిలచితి పుడమియందు
ఏవిధావను సంతోషమెట్లుగనైతి
బ్రతుకగా నేను! ఇట్టుల ఫలముదక్క-

దైవమా ఇప్పుడు నాకేందోవ. దేశదేశములు తిరిగి అనేక ధనవ్యయంతో అసాధారణ కష్ట పరంపరలకులోనై బ్రతిమాలి భంగపడి అతని ఇచ్ఛానుసారిగనై నా ప్రమోదునెట్లో గృహోన్ముఖుని జేసుకోగలిగాను. కాని ప్రయోజనం. వాడవివాహితుడై వుండటం నాకెంతో దుర్భరంగా వుంది. వాని మనస్సును సంసారంపై మరలించెనని తత్సంబంధమైన వాతావరణాన్నికూడ కల్పించిచూచాను కాని ఏమాత్రం చలించినట్లు కనబడదు. ఇకమా ఆవిడవిషయం విచారిస్తే మరీ అధ్వాన్నంగావుంది. నేనావిడ అభీష్టాలు తీర్చడమే తప్ప నా కాప్యాయనంగా తిరిగేదేమీలేదు. పైపెచ్చు నేనంటే

నిర్లక్ష్యభావం. ఇన్ని సహించినా ఇంక పిల్లా పాపో కలిగే ఆశ లేదు. (యోజించి) నా ప్రయోజక కుమారుని కాలంతో మంచి గొప్పవంశీకులు కన్యాదానం చేస్తామంటున్నారు నే కేం జేసేది. ఏమైనాగాని. ఇప్పుడు మంచి ప్రశాంతంగావుంది. మళ్లీ నా చేతనైనంతవరకు సంజాయిషీ చేసిచూస్తాను. (ప్రమోదుని పిలువ ప్రమోద్ వచ్చును)

ప్ర:- ఏంటన్నయ్యా

శ్రీ:- కూర్చో బాబూ నాకీరోజేంటో దిగులుగావుంది నిద్రరావటం లేదు.

ప్ర:- అంత విభ్రమ కారణ మేంటి

శ్రీ:- నాకంటూ విభ్రమకారణమే కాందేముంది

ప్ర:- మీ మనశ్శాంతికోరకే సర్వసంగపరిత్యాగం జేసిన నేనుకూడ ఇంట్లోనేవుండిపోతినిగదా.

శ్రీ:- (దుఃఖముతో) నిశ్చయమే కాని నిన్నుచూస్తున్న కొద్దీ దుఃఖ భాజనంగావుంది. చూడకుండావుంటే అంతకన్నా

ప్ర:- అలా మనఃఖపడతా రెందుకన్నయ్యా! పెద్దవారు మీరే దుఃఖిస్తే నాబోటివాళ్లగుండె చెదిరిపోవాల్సిందే.

శ్రీ:- ఏదన్నాక మరేంచేయమంటావు. మనవశంకాని మనతోనే తుద ముట్టాల్సిందేగా.

ప్ర:- అలా అనకండి నాసంగతి వేరు మీసంగతి వేరు

శ్రీ:- మన ఇద్దరిసంగతి వకటే యీ జన్మలో నాకు సంతానప్రాప్తి వుంటేగా

ప్ర:- నిరాశపడతారెందుకు

శ్రీ:- నావిషయంలో నాకు చాలా దినములక్రితమే నిరాశకల్గింది కాని నీపైనన్నే ఆశలన్నీ నిల్పాను.

ప్ర:- నాపైనే నాకాశ లేనప్పుడు మీ ఆశకూడ నాపైనే నిల్పకండి.

శ్రీ:- సరి నేనేంజేయగలను. నీవు నాకంటె వాడవైనావు నీకు తెలియనిదేముంది పైగా నీకు చెప్పే సమర్థతా నాకు లేదు.

ప్ర;- అలాఅనకండి నేనెంత పెద్దవాణ్ణయినా మీకంటే చిన్నవాణ్ణే నాకు మీరెప్పుడైనా చెప్పగలుగుతారు.

శ్రీ;- చెప్పగలిగి తేమాత్రం వినేవాళ్ళున్నప్పుడుగదా ప్రయోజనం.

ప్ర;- ప్రయోజనం లేకేం చెప్పండి.

శ్రీ;- నీకు తెలియం దేమున్నది. యావ్వనుడవు. చాలినంత ఆస్తి... ... ...

ప్ర;- మీ భావం నాకు గ్రాహ్యమయింది. ఆ విషయాలన్నీ నిజమే కాని యీ నిర్భాగ్యునికి ప్రాప్తి లేనప్పుడు మీ రేం చేస్తారు.

శ్రీ;- అవకాశా లున్నప్పుడు ప్రాప్తి అనడంలో అర్థం లేదు.

ప్ర:- నా అంతరాత్మ అంగీకరించనప్పుడు నే నేం జేసేది.

శ్రీ;- నీవు పరమార్థి వని నాకు తెలియందికాదు. కనుక నీకు కావల్సిందల్లా ముక్తిపథమే అనుకుంటాను.

ప్ర;- అవును. అంతే.

శ్రీ;- అయితే వేదవేదాంగపారంగతులైన ముముక్షువు లేమన్నారో విన్నావా.

గీ. శక్తియుక్తుఁడు పరమార్థియు క్షీణాంకు
వనముఁగని ముక్కుమూయుఁగఁ జనఁ డెవండు,
ఆలుబిడ్డలసంసరణాంబురాశి,
నీటఁ గల తామరాకుఁగా నెగడవలయు.

కాబట్టి రాజయోగమే మోక్షకామికి ఉత్తమపథం.

శ్రీ;- ఇవన్నీ నేను కాదనను. కాని హృదయం లేని జీవచ్ఛవాన్ని. నేనంత సమర్థుడను కా ననుకుంటా. క్షమించండి... ... అన్నయ్యా; మీ మాటల కెదురాడటం ఉభయత్రా దుఃఖకారణ మౌతుంది. కాబట్టి నేను వెళుతా. చాలా రాత్రయింది. మనస్సు కుదుటబరచుకొని పడుకోండి. (వెళ్ళుతూ)

గీ. నశ్వరం బగు సంసారనాటకమున
క్లేశలేశంబు లేకయే కేలబడిన

పెన్నిధి వీడుకనే? ఎట్టి శీలమైన;
యోగి భోగి కాగోరిన యోగ్యమగునె?

(వెళ్లును)

శ్రీ:- (నిట్టూర్పు విడచి) నీనితో శాస్త్రవాదం చేయటం నిష్ప్రయో జనం. ...బహుశః నేను వలచిన పిల్లను పోగొట్టుకొన్నం దుకు దీనికి సంసారంపై మమత పోయుండొచ్చు. సరి. అన్ని అనుమానిస్తాను. వచ్చుకొన్ని కాపురం పెడదామన్నా ఆ పిల్ల అచూకీ ఏమీ తెలిసిందిగాదు. దీని మనో నైరాశ్యం చూస్తే ఆవిడ ధ్యాసకి నాస్తికనిది నా కనుమానమే. హా దైవమా! ఇందరి నుద్ధరించి నన్నొకడ పిచ్చివాణ్ణి చేశావు. ఇక నీ యిష్టం, నా ప్రాప్తం.

ఉ. ఒక్కఁడు సంతు గోరి మరియొక్కఁడు బిడ్డలు మొక్కఁగాఁ, బలు
వొక్కఁడు నాతికై ముసలి యొక్కఁడు భార్యలఁ బోరుచేయ; నిం
కొక్కఁడు తిండికై పిసినియొక్కఁడమేయ ధనంబు గావఁగాఁ,
నిక్కరణిన్ జగంబు మది నేడ్చుట నీకు ముదంబె? ఈశ్వరా.

(మేను వాల్చును)

(ముగ్గురు చోరులు ముసుగులతో ప్రవేశం)

1 వ - (రెండవవానితో) ఇదిగో నీ వా చాయన వెళ్ళి ఏమైనా విలువైన వస్తువులు లభిస్తవేమో వెదకు. (సైగ చేయును, మూడవవానితో) నీవు నలువైపుల కాపలా కాస్తూవుండు. నేను అతని మెడలో వున్న ఇనప్పెట్టె తాళపుచెవులు తిన్నగా లాగేస్తాను. (అని శ్రీవల్లభుని సమీపించి బాకుతో పొడవగా అతను ప్రమోద్ అని కేక వేసి స్మృతి తప్పును.)

శర్మ:- శాబాష్ ఎంత పని చేశావే, నాకు కంపమెత్తుతుంది.

శా:- నా కాళ్ళు వణకుతున్నవి. ఏం చేసేది?

స్వా:- నైరినాగన్నలు నే నేం చేసేది? కీన్ తీసేవరకు సెల్లోని నా చేతిని గట్టిగా పట్టుకున్నాడు. గత్యంతరం లేక యీ పని చేయాల్సొచ్చింది, భయ మెందుకు?

శర్మ:- సరి జరిగిందేదో జరిగింది. ఇప్పటికైనా పలాయనం సాగిస్తే కీడులో మేలౌతుంది, జల్దీ,

స్వా:- నో, నో: అదెప్పటికైనా మోసం. మీరు రహస్యంగా పోలీసులను పిల్చుకురండి, నేనంతా చక్రం తిప్పేస్తా.

(ముగ్గురు వెళ్ళుదురు)

(ప్రమోద్ ప్రవేశము)

ప్ర. అయ్యో, అయ్యో, యిదేమిటి కలగంటున్నానా! అన్నయ్యా, అన్నయ్యా (పైనబడబోయి బాకును జూచి నిర్విణ్ణుడై మెల్లగా బాకును లాగి ప్రక్కన కూర్చుని) (ఏడుస్తూ) అన్నా, నా విచారములన్నీ వదలించుకొంటివా. నీవు పెట్టిన గిర దాటను. నన్ను నమ్మి ఒకసారి నావైపు చూడవా. నీ తమ్ముని వదలి వెళ్ళుదువా? ఆఁ మాటాడవా? నాపై కోపం వచ్చిందా? క్షమించవా?

ఉ. అన్నా నన్విడిపోయితే! సతము నా కానందమున్ గూర్పఁగాఁ నెన్నో యిక్కటులన్ సహించినను నిన్నేమారితిఁ గాన, నీ విన్నాణంపు దయార్ద్ర దృక్కులను నన్వీక్షించి మన్నింపుమా! నన్నున్ బోలిన సర్వశూన్యహృదయుల్ నాశంబుగా రేలకో.

(కోపంతో) ఎవడురా నా అన్నను పొడిచింది నిలు, నీ డొక్కలో నిద్రపోతాను. నిన్నిదే బాకుకు చవిజూపి నా అన్నగారిపాదాల కర్పిస్తాను. మొగవాడవైతే నిలు. ఛీ దొంగ. (పరుగెత్తబోగా కాంత ఎదురై)

కాం:- ఏం ప్రమోద్, ఇంత ఆర్భాటంచేస్తూ పరుగెత్తుతున్నావు? ఈ అర్ధరాత్రివేళ. (ప్రమోద్ మాట్లాడక శ్రీవల్లభునిదగ్గరకు వెళ్ళి చతికిలబడును.)

కాం:- (దృశ్యం చూచి) అయ్యో, బాబో, హత్య, హత్య. (తల కొట్టుకుంటూ) నా దీపానార్పేశారో బాబూ, నా కెవరు దిక్కు చెప్పడా. నా దేవు న్నెత్తుకుపోయారు.

స్వా:- (ప్రవేశించి, ఆదుర్దాతో) ఏం జరిగిం దేం జరిగిం దమ్మాయి.

కాం:- ఇం కేముంది స్వామీ, నా ఆశలన్నీ ఆరిపోయినయి. (శ్రీవల్లభుని జూపును.)

స్వా:- ఆహా, ఎంత మోసం లేక ద్రోహమనికూడ చెప్పవచ్చును. ఎంత ధర్మవిరుద్ధమైన కార్యం జరిగింది. పాపం ధర్మప్రభువు. (కాంతంతో) అమ్మాయీ, చచ్చినవారిని శోకించి సాధించగలదా. కర్మానుభవం అనుభవింపక ఎంతటివారికిని తప్పదు. భగవత్సంకల్పమునకు మన మెన్నటికిని బాధ్యులము కాము. ఊరడిల్లుము. మానవదేహములు బుద్బుదప్రాయములు.

(పోలీసులు ప్రవేశింతురు)

పో:- మర్డర్, మర్డర్ ... ... (పరిశీలించును)

స్వా:- ముర్దార్ గాదండీ మహానుభావా. హలాల్ చేసినారు. పరిభాషలో దీన్ని హత్యనికూడ అనెదరు.

పో:- (తీక్ష్ణంగా) ముర్దార్ అనలేదయ్యా మర్డర్ అన్నాను. నీకు చెవులు లేవు.

శర్మ:- ఏకవచన ప్రయోగం చేస్తున్నారే. మా గురువుగారిని. మరియాద కాదనుకుంటాను మీలాంటివారికి. ... ...

పో:- కామూన్. వెధవవాగుడూ నీరూనూ.

స్వా:- వారి కంతమాత్రం తెలియదా? మంచి ధర్మశీలు రని విన్నాను.

పో:- ఆగండి. పొడిచేటప్పుడు ఎవరైన చూచారా?

స్వా:- మేము చూడలేకపోయితిమి. కాని యీ యమ్మ చూచెనట.

పో:- ఏమమ్మా నీవు చూచావా? ఎవరు పొడిచారు?

కాం:- చూచాను బాబుగారు. (ప్రమోద్‌ను చూపి) ఇయనే.

పో:- ఇతనే యని ఎలా రుజువుచేయగలవు?

స్వా:- ఇం కెవరు బరిమార్చెదరు. శ్రీవల్లభుడు ధర్మమూర్తి.

పో:- షటప్. నిన్నడుగలేదు.

పో;- (నవ్వి) నీవు వచ్చేవరకేం చేస్తున్నావు ప్రమోద్ ?
స్వా;- ఇంకనూ పలాయనము యత్నంలో వుండెను
పో:- నీవేమైనా అడ్డగించావా ?
స్వా;- మమ్ము చూడగానే కాలు కదల్పలేక వణకుచుండెను. మే మెంతైనా యోగబలము కలవారము.
పో:- (ప్రమోద్‌తో) నీ పేరు ?
ప్ర:- ప్రమోదకుమారు అంటారు.
పో:- నీవే హత్యచేశావా ?
ప్ర:- నాకేమీ తెలియదు.
శాం:- అబ్బా, ఎంత నాలిముచ్చు.
స్వా:- మరి ఏమనును. కలిమాయ, ధర్మదేవత దారి తప్పినది
పో;- నీ వలా అనడం అనవసరమమ్మా
శాం;- (ఏడుస్తూ) అయ్యో దేవుడా, నాకే అనవసరమట. నా దేవుణ్ని ఎత్తుకుపోతూవుంటె.
స్వా;- అమ్మాయీ! గతజలసేతుబంధనమేల. మనస్సు కుదుటబరచు కొనుము. భయపడకుము.
శర్మ;- ఔను తల్లీ. కావల్సిందేమో ఐంది. ధైర్యం తెచ్చుకోండి.
శా;- విధివ్రాత నెవరు తప్పించుకొనగలరు ?
పో;- ఉస్. చాద స్తపుబావనాళ్ళంశా, జమయివారు. ఆలికి చేశారంటే అవతలికి గెంటివేస్తా. కబడ్దార్. (ప్రమోద్‌తో) నీ విక్కడికెలా రాగలిగావు ?
ప్ర;- నేను ప్రక్కగదిలోనే వుంటున్నాను. ఏదో బుక్కు చదువుకుంటూ, ప్రమోద్ అనే కేక వినబడగానే వచ్చేశాను
పో;- వచ్చేవరకు ఏం జరిగింది ?
ప్ర;- నా బ్రదర్ మూల్గుతున్నాడు. ఎవరో పరుగెత్తిన చప్పుడు మాత్రం వినవడ్డది.

పో;- నీవు వెంబడించకుండా ఎలా వూరుకోగలిగావు ?

ప్ర;- బాకు నా అన్నగార్కి పక్కలో గ్రుచ్చుకొనివుండడంవల్ల అది లాగివేయకుండా వుండలేకపోయాను. అదిగాక ఆ దృశ్యం చూచేవరకు కలిగిన భయదుఃఖాలవల్ల అక్కడే కూలబడ్డాను.

కాం:- అయ్యో, పిల్లాజెల్లా లేనివాళ్ళం ఏం కట్టుకుపోతామని చంపాల్సొచ్చింది నా దేవుణ్ణి.

పో:- నీ పేరేమమ్మా ?

కాం:- నా పేరు కాంతమండీ బాబూ.

పో:- నీ భర్తతో ప్రమోదు కేమైన తగాదావుందా ?

కాం:- ఉన్నది బాబూ లేకేం. ఇతనొక మాలపిల్లను యెత్తుకొచ్చి యింట్లో వుంటానంటే దానికి మావా రొప్పుకొనలేదు. దాని పై మద్రాసులో కాపురంపెట్టాడు. ఆవిడ కాస్త లేచిపోయిం దట. అంతటితో యింటి కొచ్చాడు. కులభ్రష్టుడైనాడని అన్న గారు కోప్పడి యితన్ని ప్రత్యేకగదిలో వుంచారు. రోజూ తగాదా పెట్టుకొనేవాడితను. నా భర్త కీ లోకంలో ఎవరి తోనూ విరోధం లేదు. ధర్మదేవునిలాంటివాడు. ఈ స్వామి వారికన్నీ తెలుసు.

పో:- నీ కన్నీ ఎలా తెలుసునయ్యా స్వామీ.

స్వా;- మాకన్నీ అవగాహనమే. ఏలననగా మేము మఠాధిపతులము. ధర్మనేత్తలము. కాబట్టి సాంఘికసమస్యలన్నియు మావద్దనే పరిష్కరింపబడుచుండును.

పో;- ప్రమోద్‌కుమార్! నీవే మర్డర్ చేసినట్టుగా రుజువైంది. దీనికి నీ సమాధాన మేమి ?

ప్ర;- (నెమ్మదిగా) నా కెట్లయినా సమాధానమే. నా కావంతకూడ విచారం లేదు. అన్నగారి హత్యావిచారంతప్ప.

పో;- (కానిస్టేబిల్‌తో ప్రమోద్‌ను చూపుతూ) యీతన్ని అరెస్టు చేయుము.

(జవాన్ ప్రమోద్‌ను బంధించి తీసుకొనిపోవుచుండ)

ప్ర:-

ఉ॰ ఓ సకలాంతరంగ! మదినూన్చుట నా కతిగించితౌర! న
న్నే సకలం బటంచుఁ గద నెంచిన యట్టి మదగజాంతమున్
గాసిల నాదు కన్నులకుఁ గానఁగఁ జేసితి వంతె కాదు, నక
దోసిగఁ జేసితే, జనుడు దొంగలబోనుకు వీతరాగినై.

(వెళ్లును)

పో:- ఏమమ్మా మీరు కారుండా?

కాం:- ఎందుకు బాబూ.

పో:- మీవారిని హాస్పిటల్‌కు తీసుకువెళ్ళడానికి.

స్వా:- శవం అపవిత్ర మగునుకదా!

పో:- చచ్చాడని ఎలా తెలుసు నీకు. స్పృహతప్పకూడదా?

కాం:- (ఏడుస్తూ) ఇంకెక్కడి బ్రతకడం బాబూ.

స్వా:- అవును, వారు గొప్ప వంశీకులు. చక్కగా శాస్త్రోక్తంగా దహనక్రియలు... ...

పో:- నోరుమూయి. చచ్చినా పోస్టుమార్టం తప్పదు. (శర్మతో) కారుడ్రైవరును పిలవ్వయ్యా అర్జంటుగా.

(తెరప్రాలును.)

చతుర్థాంకము సమాప్తి.

---

# కల్యాణి



## పంచమాంకము

## మొదటిరంగం

(భిక్షుకుడు, మాధవుడు వీథిలో)

పాట ("లోకమంతా లోభులు" మాదిరి)

లోభులను యీ లోకమూ - లాభదాయక మయ్యెగా
దేశాభిమానుల ఘోషణం - ఆకాశరోదన మయ్యెగా.
ధర్మదేవత దారితప్పెను - దుర్మదాంధుల ధాటికి
మర్మ మెఱుగర సోదరా - మార్గ మియ్యది కాటికి (దే)
అంటరానితనమునీ - యాత్మయందే కానరా
అన్యులాశ్రయమండగానే - అంటుమాయ మదేలరా. (దే)

భిక్షు:- అయ్యో! ఒక్కరైనా బిచ్చమేసేవారు లేరే. హా దైవమా! మాకేం దిక్కు? మా మొర వినేవారీ లోకంలో లేరా? కలిమి లేనివాళ్ళకు, అంటరానివాళ్ళకీ ప్రపంచంలో తావే లేదా? ఎంత నీచము! మానవశరీరానికే అంటున్నప్పుడు ఇంక అంటు లేని వస్తువేది? ఇలాంటి అత్యాచారాలను సృష్టించిన పెద్దలుమాత్రం మనుష్యులు కారా? పెద్దల కత్తులకు రెండువేపులా పదునుంటాను. ద్రోహం.

సీ. పెద్దల మనువారు పీనాశితనమున
అన్నదమ్ముల యాస్తి నపహరింత్రు
పెద్దలు సేవింత్రు పెద్దసారాయిలు
గొద్దివారికి నది రద్ది యంద్రు
పెద్దల కామంబు బెదరదు వరుసను
మాతమనుమును జూచి మారుచుంద్రు

పెద్దలు భుజియింతు పెరవారలను గూడి
తోడివారిని ముట్టఁ దోస మంద్రు
గీ॥ పెద్ద లనువారి చరితలు పేరుకొనఁగ
నాదిశేషునికైనను యలవికాదు
పిలుకులలను జూచి పేతురు పీట లకట!
యిట్టి లోకాన మముబోంట్ల కెవరు దిక్కు?

అయ్యో మూడు రోజులు అన్నం లేక తెలివిదప్పి పడిపోయిన యీ పిల్లవాణ్ణి ఎట్లో పోషించుకుందాం అనుకున్నాను. కాని అబ్బా! యింత గంజైనా పోయు లేకపోతివా దైవమా.

మాధ;- (ఏడుస్తూ) అబ్బా ఆకలేస్తూవుంది. నడవలేను. నా అక్కను ఎప్పుడు చూపిస్తారు.

బి:- ఏడ్వకు తండ్రీ, ఇప్పుడే అన్నం పెట్టిస్తా. మీ అక్కకొరకే వెళ్తున్నాంకదా……కలిమిలేములు కావడికుండలు. ఏనాటికైనా శుభదినాలు రాకపోవు. వెళ్ళుదాం రా.

—; పాట :—

ఎవరి కెవరు లేరో మాధా స్వార్థమయ మీ జగము
తోడిమానవులదోస మెంతురు తుచ్ఛపుపనులను జేయుచుందురు
అన్నిట తామే యధికుల మందురు కన్ను లెఱ్ఱనా యిది తగదన్నా ॥స్వార్థ॥

---

## రెండవ రంగం

(హాస్పిటల్‌లో మంచంపై శ్రీవల్లభుడు, కల్యాణి నర్సువేషములో)

నర్సు:-

ఉ. నాదు మనోవిభుండు బహుళనర్మిలి పత్నిగ నన్ గ్రహించి దా
యాదుల శ్రీలనోడెను మదర్పిత రాగసుధానురక్తిమై,
నా దురదృష్టమే మనుదు నన్ విడె, నా ప్రభుఁ గాంచు భాగ్యమే
లేదన గుండె నీరగు, కులీనని యెంచడో; కాంచగల్గుచో.

హా ప్రభూ! నా మొరాలకించేవా రెవరు? తండ్రిసమానులైన
డాక్టర్ గారు నా భర్తకై దేశమంతా వెదకించారు. కాని
లాభం లేకపోయింది. ఇంకా ప్రయత్నం సాగిస్తా నని గడువు
పెట్టారు. నాలో ఉన్న ఆసే నన్ను లాక్కొస్తూవుంది......
నా ముద్దులతమ్ముడు అన్నాహారా లేక (ఏడుస్తూ) ఎక్కడ
పరిస్థితిలో లీనమైపోయాడో. జాడ యేమీ లేదు. అయ్యో
దేవుడా! లోకంతోపాటు నీకుకూడ పక్షపాతబుద్ధి కల్గిందా.
(కంట్లు మూయును)

(తెరలో మాధవుడు "లోభులకు" అను పాట పాడును.)

నర్సు:- (విభ్రాంతితో) ఆఁ ఆఁ ఏమి, నా తమ్ముని కంఠధ్వని వినబడు
తుందే. (వినుట నభినయించి) తప్పక నా తమ్ముడే. (మాధ
వుడు ముందు సైడులో మళ్ళీ పాటపాడును. కల్యాణి ముందుకు
నడచి మాధవుని చూచి) మాధవా (అనగానే మాధవుడు
అక్కా అనును. ఇద్దరు కౌగలించుకొందురు.)

నర్సు:- మాధవా, ఇదేమి ఆకారము! (ఏడుస్తూ) నావల్ల నీ కెన్ని
కష్టాలు వచ్చాయిరా బాబూ. అలసినట్టుగా వున్నావు.
కూర్చుందువుగానిరా. (కుర్చీలో కూర్చోబెట్టును)

మాధ:- (ఏడుస్తూ) ఇన్నాళ్ళదాకా ఎక్కడున్నా వక్కా?

నర్సు:- పెద్దకథ నాయనా, ఇదంతా మనప్రారబ్ధం. తర్వాత నింపాదిగా
మాట్లాడుకుందాం. ముందు నీ పండ్లు తిను. (పండ్లు యిచ్చును)

రోగి:- (పొర్లుతూ కలవరించును) ప్రమోద్......

నర్సు:- (ఆశ్చర్యంతో) ఆఁ యిదేమి? ఈ వ్యక్తి ఎవరు? నా భర్తపే
రుచ్చరించుచున్నాడే! ఈయనకు వారితో ఏమైన సంబంధ
ముండవచ్చునా, లేక కలగంటున్నానా! (యోచించి) కాదు
నిజమే.

గీ॥ అమృతపు గుళికలు నా నాథునామాక్షరములు
కౌగలించెను నేడు నా కర్ణయుగము

చక్షువుల కీర్తి పెరిగెను, జాలువారె
దేహమునుండు కేత్తె హృదయాన దీప్తి కలిగె.

మాధ:-అక్కా యీ మంచంలో పడుకున్నదెవరే ?

నర్సు-నాకు తెలియదు. ఇది ఆస్పత్రి, ఈయన రోగి.

మాధ;-మన బావ ఎక్కడున్నాడే ?

నర్సు-వారెక్కడ వుండీ యింతవరకు తెలియలేదు.

రోగి: (పార్లమెంటు ప్రమోషన్ అని కలవరించును)

మాధ;-యీనెవరో బావను పిలుస్తున్నాడు. ఆయన్నడిగితే బావ జాడ తెలుస్తుందేమో అక్కా.

నర్సు;-రోగి ఆయాసంలో ఉన్నాడు. పలుకరిస్తే మరీ యెక్కువౌతుంది జబ్బు. అయినా ప్రపంచంలో ఎంతమంది పేర్లు ఒకేతీరుగా! (ఆలోచించి) అంత అదృష్టమా! నా హృదయాని కేదో యిన్నాళ్ళనుంచి యెరుగని అదోతీపు ఆందోళన కలుగుతుందే. (ఆగి) మావారికో అన్నగారున్నారని చెప్పేవారు. ఈయన్ని చూస్తే గొప్పవంశీకునివలె కన్పిస్తున్నాడు. సరి, ఏమైనగాని డాక్టర్ బాబు నడిగిచూస్తా. వారికన్నీ తెలిసేవుంటాయనుకుంటా. వారు వచ్చేవేళకూడ అయింది. (సర్దుచుండును)

డాక్టర్;-(ప్రవేశించి) [మాధవుని జూచి] యీ అబ్బాయి ఎవరు కల్యాణీ ?

కల్యా;-(సంతోషంతో) వీడే నా తమ్ముడు. మీ దయవల్ల యీ రోజిక్కడే దొరికాడు.

డా;- ఎలా దొరికాడు ? (మాధవుతల నిమురును)

కల్యా-గంటక్రితం పాటపాడుతూ, బిచ్చమెత్తుతూ హాస్పిటల్ ముందుగా వెళ్ళుతుంటే, ధ్వని గుర్తించి తోడి తెచ్చాను.

డా;- అయ్యో, పాపం త్వరగా వ్యానతో యింటికి పంపించు. బట్టలు మార్చుకొని భోంచేస్తాడు.

కల్యా;-అలాగే. (లోపలికి వంపి మరల వచ్చును)

డా;- అమ్మా! యీ పేషంటు టెంపరేచ రెలా వుంది?

కల్యా;-నార్మల్ గానే వుంది సార్.

డా;- బాగా నిద్రపట్టిందా?

కల్యా:-పట్టింది సార్.

డా;- లేవగానే మెడిసన్ నివ్వు.

కల్యా;-మంచిది. (డాక్టర్ పోబోవ) యీనకీ దెబ్బ ఎలా తగిలింది సార్?

డా;- బాకుతో పొడిచారట.

కల్యా:-ఏ వూరండీ వీరిది?

డా;- ఏదో వూరట. మన కెందు కొచ్చింది? (పోబోవ)

కల్యా:-రెండుమూడుసార్లు కలవరించాడు సార్.

డా;- ఏమని?

కల్యా:-(తల వంచికొని) మావారి పేరు?

రోగి;- ఆఁ. నా తమ్ము డేడీ? నా ప్ర... మో...ద్.

డా;- మీరు మాట్లాడవద్దు, ఆయాసం కల్గుతుంది. (రోగివద్దకు వెళ్ళి అనును)

కల్యా:-పాపం. తమ్ముని చూడవలె నని కలవరపడుతున్నాడు. పిలిపించరాదండి.

రోగి:- నా ప్రమోద్‌ను చూడకుండావుండ లేను. నన్ను వెళ్ళనివ్వండి (లేవబోవును)

డా;- (పడుకో బెట్టి) తొందరపడకండి. మీ తమ్ము డిప్పుడే వస్తాడు. పడుకోండి.

(నౌకరు ప్యాన్ చీటీ తెచ్చియిచ్చును)

కల్యా:-బాబూ! మీ రేదో నాకు తెల్పకుండ కప్పివుస్తున్నారు. మావారే ఆయివుంటారు.

డా;- తొందరపడకమ్మాయీ. (రోగితో) మిమ్మ పొడిచిం దెవరో చెప్పగలరా ?

రోగి:-మనిషిని చూచానుకాని పరిచయంలేని ముఖం.

డా;- మీ తమ్ముడైతే కాదుగదా.

రోగి;- ఆఁ నా తమ్ముడా...నా ప్రమోదుడా...ఎన్నటికీ కాదు.

కల్యా:-వారితమ్ము డని ఎవ రన్నారు సార్ ?

డా:- కల్యాణీ, యీ ప్రమోదుడే నీ భర్త. ఇన్నాళ్ళనుండీ ప్రమోదుడే నేరస్తు డనే వుద్దేశ్యంతో, నీకు చెపితే బెంగపడ తావని నిజం దాచాను. ఇక విచారం లేదు. నీ కష్టాలు కడ తేరి నట్లే.

కల్యా;-అయితే వా రెక్కడ వున్నారో చెప్తె నే వెళ్తా.

రోగి:-డాక్టరుగారూ యీమె ఎవరు ?

డా:- ఈమె నీ తమ్ముని భార్య, కల్యాణి.

రోగి:-అమ్మో, యీ దంపతులకు నామూలంగా, వియోగదుఃఖం కలిగింది. నే జేసిన పాపమంతా అనుభవిస్తున్నాను.

డా:- రేపు కోర్టులో మీ కేసు వాయిదా వుంది. మిమ్మ తీసుకు వస్తా నని జడ్జిగారికి కబురంపుతాను. అక్కడ మీ స్టేటు మెంటు యివ్వాల్సొస్తుంది.

రోగి:-మరి నా తమ్ము డేడీ ? త్వరగా పిలిపించండి.

డా;- అలాగే. మీ తమ్ముడు మీ వూ రెళ్ళాడు. రేపు వాయిదాకు గాని రాడు. ఓపికపట్టండి.

[తెర పడును)

## నాల్గవరంగం

### — జడ్జికోర్టు —

(జడ్జి, ప్రాసిక్యూటర్, స్వామి, శర్మ, శాస్త్రి, కాంతం, జవాన్)

[ప్రమోద్ బోనులో నిల్చును]

ప్రాసి:-(లేచి) యువర్ ఆనర్, 25 వ జులై మధ్య రాత్రి 2 గంటలకు శర్మ, శాస్త్రి అను యిద్దరు నా స్టేషన్‌కు వచ్చి శ్రీవల్లభు జమీందార్ మర్డర్ జరిగిందని ఇన్‌ఫాం చేసినందున వీరమల్లు అనే 245 కానిస్టేబిల్‌ను వెంట నిడుకొని స్పాటుపైకి వెళ్ళితిని. వెళ్ళేసరికి కాంతంగారు, స్వామీజీ, జమీందారు మంచంకు చెరొకప్రక్క నిలబడియున్నారు. ప్రమోద్ కుమారుడు రక్తపుచేతులతో బాకును తనవద్ద పెట్టుకుని, జమీందార్ ప్రక్కలో కూర్చునివున్నాడు. నేను విషయమంతా డీటేల్స్ విచారించి ప్రమోద్ కుమారుడే నేరస్తుడని గ్రహించి, అతనిని అరెస్టుచేశాను. సో యువర్ ఆనర్. దోషికి కఠినశిక్ష విధించి యికముందు యిలాంటిదురంతములు జరుగకుండా చేయగలకని ప్రార్థిస్తున్నాను.

(మరా)-హత్యాస్థలములో నేను చేసిన ఎంక్వైరీ ఫయిల్ యువర్ ఆనర్ యిదివరకే చిత్తగించారు. తిరిగి మనవిచేసుకొనుట అనుచిత మనుకుంటాను.

జడ్జి:- ప్రమోద్, నీవు నిర్దోషి వని ఋజువుచేయు సాక్ష్యమేమైన వున్నదా ?

ప్ర;- ఏమీ లేదు. నాకు ఆ దేవుడే సాక్ష్యం.

జడ్జి;- నీవు ప్లీడర్ను పెట్టుకో లేదా ?

ప్ర:- నా కెవ్వరు అవుసరం లేదు.

జడ్జి:- మంచిది. కాని యీ దోషారోపణవిషయంలో నీవు స్వాయముగా మాటాడదలచావా ?

ప్ర:- నే నేమీ మాట్లాడదలుచుకో లేదు.

జడ్జి:- అయితే ప్రాసిక్యూటర్ చెప్పినదంతా వప్పుకున్నావన్నమాట.

ప్ర;- అయ్యా అంతా వప్పుకుంటాను. కాని హత్య చేసింది మాత్రం నేను కానని దృఢంగా చెప్పగలను.

ప్రాసి:-యువర్ ఆనర్ దోషిత్వమంతా అతని ముఖంలోనే కన్పడుతున్నది.

స్వామి:-నిజం ప్రభూ. ఇక అతనినివిచారించుటకూడ అనుచితమనియే నా తలంపు.

జడ్జి:- సైలెన్సు. కాంతంగారు! ప్రాసిక్యూటర్ చెప్పిందంతా నిజమని వప్పుకుంటారా?

కాం:- (ఏడుస్తూ) అయ్యో దేవుడా, ఒప్పుకోక యింకేముంది ప్రభూ, అంతా కండ్లారా చూచిన సంగతే.

జడ్జి;- అయితే నీ మరదిని శిక్షించవలసినదేనా?

కాం:- ఎక్కడి మరది. నా దేవుని మింగి కూర్చున్నాడు. అతన్ని తగలేసినా పాపహరంకాదు ప్రభూ

జడ్జి:- [నవ్వుతూ] స్వామీజీ! ప్రమోద్ హంతకుడని నీవు గట్టిగా చెప్పగలవా?

స్వా:- అం. దోషియే స్వయముగా తన దోషిత్వము నొప్పుకొనుచున్నప్పుడు నే జెప్పుటకు సందియము మేల?

జడ్జి:- అట్లయిన ప్రమోదకుమారునకు శిక్ష తప్పదు.

స్వా;- దేవర చిత్తము. న్యాయమూర్తులకు తెలియని దేమున్నది. శిక్షాస్మృతి ననుసరించుటయే ప్రభువులకు సర్వదా శ్రేయము. (ఆగి) అయ్యా, నా దొక విన్నపము.

జడ్జి;- ఏమది చెప్పుము.

స్వా:- తన భర్తశవమును తన కప్పగించ లేదని కాంతంగారు మిక్కిలిగా దుఃఖించుచున్నారు.

జడ్జి;- శవాన్నేమి చేసుకుంటుందయ్యా స్వామీ.

స్వా:- అయ్యా, శ్రీవల్లభుడు గొప్ప పురుషార్థి. అతని శవమునకు శాస్త్రరీత్యా కర్మకాండ జరుపకుండినచో పరలోకగతు లుం

డవు. పాప మీ సాధ్వి భర్తవియోగదుఃఖమున ఎక్కువ కాలము జీవించు నని తోచదు.

(జడ్జి నవ్వును. అందరు ఖిన్నులయ్యెదరు. ఇంతలో డాక్టర్, శ్రీవల్లభుడు ప్రవేశం)

శ్రీవ:- [ప్రమోద్‌ను చూచి] నా ప్రమోద్ [ప్రమోద్ చెంతకు పోబోవ, డాక్టరాపును.]

ప్ర:- అన్నయ్యా (ముందుకు పోబోవ జవాన్ ఆపును).

జడ్జి:- శ్రీవల్లభా, ముందు నా ప్రశ్నలకు జవాబివ్వండి.

శ్రీ:- చిత్తం.

జడ్జి:- మిమ్ము పొడిచినవారెవరో ఏమైనా చెప్పగలరా ?

శ్రీ:- ప్రభూ! నాతమ్ముడుమాత్రం కాదు. ఈ మునిముచ్చులే కావచ్చు.

జడ్జి:- ఆ పొడిచినమనిషి స్త్రీయా, పురుషుడా ?

శ్రీ:- స్త్రీమాత్రం కాదు, పురుషుడే.

జడ్జి:- మీరు నిద్రపోవుచుండగా పొడిచాడా ?

శ్రీ:- అప్పుడే కన్ను మూశాను. మనిషి అలికిడికాగానే కన్నులు తెరచిననిమిషంలోనే ప్రమోద్ అని నేను కేకవేయుటం, నన్ను బాకుతో పొడవటం ఓకేసారి జరిగింది.

జడ్జి:- నీ తమ్మునితో నీ కేమైన విరోధ ముందా ?

శ్రీ:- రామరామ, యీ జన్మలో అట్టిదెన్నటికి కాజాలదు.

జడ్జి:- ఈ విషయంలో మీ కెవరిపైననైనా అనుమానం వున్నదా ?

శ్రీ:- అయ్యా, యీ విషయమై నేను కొంత మనవిచేసుకోవలసి యున్నది.

జడ్జి:- మంచిది. చెప్పండి టూకీగా.

శ్రీ:- అయ్యా, నా తమ్ముడు నా కిష్టంలేని ఒక పిల్లతో కాపురం సాగించాడు మద్రాసులో. దానిపై నేను దుఃఖిస్తూవుంటే, యీ దొంగగురువు నన్ను వోదార్చినట్లు జేసి, ఏవిధంగా

నైనా ఆ పిల్లను వదల్చి నా తమ్ముని నా కొప్పగిస్తా నని వెళ్ళి వాళ్ళిద్దరిని చెరొక తెన్నూ జేసి, ఆ పిల్లను చెరపడుతూవుంటే యీ డాక్టరుగారు చూచి ఆ అమ్మాయిని వాళ్ల బారినుండి తప్పించి రక్షించారట. విరాగియై దేశాలమీద పోతూవున్న నా తమ్ముని వెదకి తెచ్చాను. నా కాయూసంగా వుంది. తక్కినవిషయమంతా డాక్టరుగారు విన్నవిస్తారు.

ప్ర:- ఆఁ మోసం. నా కల్యాణేదే? (పోబోవ జవాన్ ఆపును)

జడ్జి:- డాక్టర్, తర్వాతవిషయ మేమిటో చెప్పగలరా?

డాక్ట:-యస్. యువర్ ఆనర్. నేను మద్రాసుకు కారులో వస్తూవుండగా, అడవిలో ఒకచోట స్త్రీకంఠధ్వని పెద్దగా వినపడటంవల్ల కారాపి ఆ చోటికి వెళ్ళి చూతునుకదా, ఒక అమ్మాయిని యీ దుర్మార్గులు లాగుతూవున్నారు. వెంటనే నేను పిస్టల్ భయం చూపి ఆవిడను వదలించి ఆవిడ చెప్పిన నంబరింటికి తీసుకువెళ్ళేసరికి యింటికి తాళం వడివుండటంచేత ఆమెభర్తయైన యీ ప్రమోదకుమారుని వెదకిస్తా నని ప్రామీయిచ్చి నా పిల్లలతోపాటు యింట్లో వుంచుకొని హాస్పిటలులో నర్సుగా పనిచేయిస్తున్నాను. ఆ అమ్మాయితమ్ముని కూడ యీ సాధవలే ఆగంజేశారట. నిన్ననే బిచ్చమెత్తుకుంటూ హాస్పిటలుముందుగా వెళ్లుతూవుంటే పట్టుకున్నాం. ఇదీ విషయం.

జడ్జి:- శర్మా, మీయిద్దరా అమ్మాయిని చెరపట్టింది నిజమా?

శర్మ:- నిజం ప్రభూ! ఈ మాయకాడు మమ్ములను పురికొల్పి యీ విధంగా నాశనం జేశాడు.

జడ్జి:- ఏమి శాస్త్రీ, అంతేనా?

శాస్త్రి:-నిజమేనండి. జమీందార్ యిల్లు దోచుకుందామని యీ మాయగురువే ఆయనను పొడిచాడు.

జడ్జి:- డాక్టర్, ఆ అమ్మాయిని పిలిపిస్తారా?

డాక్ట:-యస్ సార్. (ప్యూనుకు సైగచేయగా కల్యాణి, మాధవులు

ప్రవేశింతురు ఇంతలో స్వామి చల్లగా జారుకుంటే భటుడు నెట్టును.)

జడ్జి:- (కల్యాణిని చూపుతూ) ప్రమోద్, నిన్ను విడుదలచేయుటయే కాక, అదిగో నీ కల్యాణినికూడ నీకప్పజెప్పాను. (నవ్వుతూ) నా ఘ్రాచే తీరింది. ఇక నీ యిష్టం. ముందుమాత్రం యిలాంటి మహానుభావులవలలో చిక్కబోకు.

(కల్యాణి ప్రమోద్ కలుసుకొందురు. కల్యాణి ప్రమోద్ కాళ్ళ పడబోగా, ప్రమోద్ లేపును)

కల్యా:-నన్ను క్షమించగా......నావల్లనే మీ కిన్ని కష్టాలు.

ప్ర:- ......అంతా దేవుని దయ.

జడ్జి:- కాంతంగారూ, వీరంతా చెప్పింది నిజమేనా?

కాం:- (ఏడుస్తూ) అయ్యా, నేను మహాపాతకిని. ధర్మమూర్తి అయిన నా భర్తను పొడిచింది యీ మాయలమారే. దానికి కారణమ్మాత్రం నేనే అని చెప్పకతప్పదు. నా మరది నిర్దోషి. మాపై మహాభక్తిశ్రద్ధలు గల శాంతమూర్తి. నేనీ మాయల మారివలలో జిక్కి పవిత్రప్రేమస్వరూపులైన దంపతులకు వియోగం కలిగించే అవకాశ మిచ్చాను. నాలాటివాళ్ళ బ్రతుకు భూదేవి కంతైనా భారం. ఇక నే నొక నిమిషంకూడ లోకానికి ముఖం చూపెట్టలేను. మీఅందరిక్షమాపణ కోరుతున్నాను. ఇక భగవంతునియొద్ద క్షమాపణ కోరవలసియున్నది. (బాకుతో పొడుచుకొనును)

(ప్రమోద్ కల్యాణి సమీపించబోగా శ్రీవల్లభుడు వారించును)

శ్రీ:- (ప్రమోద్ నునివారించి) ప్రమోద్, ఆ పరమభ్రష్టకోసం విచారపడడం, మన అభిమానగౌరవాల కెంతైనా కళంకం. చిరకాలంనుంచి పరితపిస్తూవున్న నా హృదయాన్ని అల్లుకొన్న ఆశాలతలు యిప్పటికి పుష్పించాయి. నిన్ను సతీసహితంగా చూడడమే నా కానందం. ఇక నాకీ విశ్వమానవలోకంతో ఏమీ పని లేదు. ఆ పరమాత్ముని పాదరేణువునైపోవడమే

యిక నా జీవితపరమావధి. నీ బాధ్యతలను నీవు గ్రహించి చిత్తసంస్కారం కలిగి వంశాన్ని వుద్ధరించుటయే ముందు నాత్మకు శాంతిప్రదం.

ప్ర;- అన్నయ్యా, యిప్పుడే యింత భారం నాపై వేయుగం...... !

శ్రీ:- అబ్బాయీ, న న్నేవిధంగా ఆటంకపరచినా అది నాకు దుఃఖ దాయక మే అవుతుంది.

డాక్ట;- ప్రమోద్, చివికిపోయిన నీ అన్నగారి హృదయానికి భక్తిజ్ఞాన వైరాగ్యాలే సుఖదాయకములు. కాబట్టి నీ వేమీ ఆటంక పరచవద్దు. శ్రీవల్లభా "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" కావున నీకు పూర్తిగా శరీరస్వస్థత కల్గిందాకా మీతమ్ముని యొద్దనే వుండండి. తర్వాత మీ యిష్టం.

శ్రీ;-అయ్యా, మీ యిష్టానుసారమే కానివ్వండి.

డాక్ట-(కల్యాణిచేతిని ప్రమోద్ చేతులో పెట్టి) ప్రమోద్, పరమ సాధ్వియైన నా బిడ్డను నీ కప్పిస్తున్నాను. అంతా నీదే భారం. ఈ కల్యాణి నీకు నీడగా చరించి నీ జీవితాన్ని కల్యాణప్రదం చేస్తుందని ఆశిస్తున్నాను. (జడ్జియొద్ద ఆజ్ఞ తీసికొని వెళ్లును)

జడ్జి;- (చేతితో అవధాని, శర్మ, శాస్త్రిని చూపి, పూర్వతో) ఈ మాయముచ్చులు. గడ్డములను మీసములను లాగివేయుము. ఈ మాయగురువుకు ద్వీపాంతరవాసశిక్ష, తక్కిన యిద్దరు శిష్యులకు మూడు మూడు సంవత్సరాల కఠినశిక్ష విధింపబడ్డది.

(అనగానే ముగ్గురిని పోలీసు జైలుకు తీసుకవెళ్లును.)

మా,- (స్వామి జైలుకు పోవుచుండగా) స్వామిజీ, యిప్పటికైనా నా బంతు లిస్తారా? (నవ్వెదరు)

(తెర వాలును)

స్త్రీలు (ముగ్గురు మోనకాళ్ళను వీథిగుండా పోలీసు
జైలుకు తీసుకుపోవుచుండగా)

స్త్రీ:-

సీ. పెదవుల శ్రీసూక్తి యెదను సానులరక్తి
వెలయువ్రాసెదు ధర్మపురుషులారా!
పైన జందెపుపోసఁ బ్రక్క బ్రాందీసీసఁ
బూజలు సల్పెడు పూజ్యులార!
సభ నుపన్యాసాలఁ జంక దొంగప్రోనోట్లు
సామర్థ్యమును జూపు సదయులార!
తనవారి నంటక తదితరులను పీక
గూడి మాడెడు బుద్ధికుశలులార!

తే. గీ. ఋషిణీఫలములఁ గన్గొరి ముఱిసి యెసవ
మిత్తి కెఱగాక యుండని యత్తెఱంగు
ఆదిలోఁ బాపపంటలు హాయి నిచ్చి
యంతమున శోకమునఁ జేల్చు నార్యులార! (నిష్క్రమణ)

శ్రీవల్లభుడు ప్రవేశించి)

సీ. కువకువలాడెడు కోమలాంగులుఁ
జచ్చుకూళల వెంటఁ గట్టకుంద్రుగాక!
కొంగజపాల్సేయు దొంగసాముల గుండె
లవపవిత్రీయూష మానుగాక!
నీ తల్లి కందోయివీలాల నురలించు
అంటుజాడ్యము మొదలంటుగాక,
అస్తోక మగు మనీషాస్తేయసంపద
నుత్తరించెడు ప్రాగు డుడుగుగాక,

తే. గీ. కులములకు గాక సుగుణనికుంజములకు
స్రక్తాంబూలమాదర మబ్బుగాక,
పరుల గాథానుషంగసంప్రాప్తి వీడి
భారతము పూర్వవిఖ్యాతి బడయుగాక. (నిష్క్రమణ

(కల్యాణి ప్రమోదుల ప్రవేశం)

కలా॰

గీ. మంజులతరధర్మశీతలమారుతములఁ
జెలఁగు భారతసాధ్వులఁ జేఱచునట్టి
దుండగీళ్ళ కుచేష్టలఁ ధూత్కరించు
కలుషకు టుద్యమంబుల భువి నెఱపుడయ్య.

ప్రమోద్

సీ. పొట్ట మాడిచి నడికట్టు బిగించి పె
ద్దలపొట్టఁ బూజించు ధార్మికుండు
తెలియకే వేదచోదితధర్మముల నెల్ల
నడుగద్గునర జాటు బడుగుతోను
రాలగుట్టల నేని జాలిచూపుల చేతఁ
బాలవెల్లిగఁ జేయఁజాలు జోగి
సర్వంసహాదేవి సహజసద్గుణములఁ
నుగ్గుపాల్గా గ్రోలు యోర్పుశాలి

తే. గీ. నైన యాదిమాంధ్రుని నంటరానితనము
కప్పనము సేయు భ్రాతృద్రోహానలమున
నెవ్వఁడో మాడిపోవక తప్ప దింక
జీర్ణదశ నున్న యాంధ్రదేశీయులార,

సంపూర్ణం

